అలెగ్జాండర్ పుష్కిన్



# ఇస్పేటురాణి

# ఇస్పేటు రాణి



రచన:
అలెగ్జాండర్ పుష్కిన్,



అనువాదం:
రెంటాల గోపాలకృష్ణ.



విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ.

# ఇస్పేటు రాణి

కృష్ణాజిల్లా పెనములూరు గ్రామస్థులు
చిగురుపాటి బుచ్చిరామయ్య గారు
డా॥ చంద్రశేఖర్ గారు
సహకరించిన పుస్తకం

# 1

ఆశ్వికదళంలో ఆఫీసరుగా ఉంటున్న నరుమోవ్ ఇంట్లో పేకాట జోరుగా సాగుతోంది. అది శీతాకాలం రాత్రి. రాత్రంతాకూడా వారికి తెలియకుండానే గడిచి పోయింది. వారు భోజనాలకు కూచునేసరికి ఉదయం అయిదుగంటలయింది. (రాత్రి జేయవలసిన భోజనం అది) ఆటలో గెలిచినవారంతా ఆవురావురున తింటు న్నారు. ఓడినవారంతా దిగాలుపడి, ఖాళీ పళ్ళాలు ముందు వేసుకుని పరధ్యానంగా కూచున్నారు. కాని తాగడానికి షాంపేన్ తెచ్చి టేబిల్‌మీద పెట్టేసరికి అందరూ ఉల్లాసంగా కబుర్లలోకి దిగారు.

"నీపనెలా ఉంది సురిన్?" అని అడిగాడు నరుమోవ్.

"ఎప్పటిలాగే పోగొట్టుకున్నాను. ఏం చేస్తాం?" నేను దురదృష్టవంతుణ్ని. ఆమాట ఒప్పుకోక తప్పదు.

నేను చిన్న చిన్న పందెములే ఒడ్డుతాను. ఎప్పుడూ ఉద్రేకపడను. అనుక్షణం మతి దగ్గరపెట్టుకుని, సంచరిస్తాను. అయినా అదేమిటో, ఎప్పుడూ పోగొట్టుకోవడమే!"

"అయితే నీకెన్నడూ ఆశ పుట్టలేదా? ఎన్నడూ ముక్కమీద ఎక్కువపందెం కాయలేదా? ఎంత గట్టివాడవయ్యా!"

"కాని హెర్మన్ చూడండి!" అన్నాడు అతిథుల్లో ఒకాయన. ఇంజనీరు యూనిఫారంలో ఉన్న యువకుడైన ఒక ఆఫీసరును చూపిస్తూ. "ఆతను జీవితంలో పేకముక్క పట్టుకుని ఎరగడు. ఎన్నడూ ఆ చాయలకూడా పోడు!" అయినా ఉదయం అయిదు గంటలవరకూ కూడా మన ప్రక్కనేకూచుని ఆటచూస్తూ ఉంటాడు!" అన్నాడు.

"పేకాటంటే నాకు తగని ఇష్టం" అన్నాడు హెర్మన్. "కాని లేనిదేదో వస్తుందని ఆశపెట్టుకుని దాని కోసం ఉన్నది పోగొట్టుకునే స్థితిలోలేను నేను" అన్నాడు.

"హెర్మన్ జర్మనీవాడు. అంచాత జాగ్రత్తగా ఉంటున్నాడు, అంతే!" అన్నాడు టామ్‌స్కీ. "కాని

మానాయనమ్మ ఉన్నది చూచారూ- కౌంటెస్ అనా ఫెడొటొవ్నా - ఆవిడ విషయమే నేను బొత్తిగా అర్థం చేసుకోలేకుండా ఉన్నాను." అన్నాడు.

"ఏమిటి? ఏమిటది?" అని అడిగారు అతిథులు, ఒకేమాటుగా.

"అదేమిటో అర్థంకాదు. ఆవిడ పుట్టి బుద్ధెరిగిన తరువాత జూదమాడలేదు" అని చెప్పాడు మళ్ళీ టామ్‌స్కీ.

"అందులో పెద్దవిశేషం ఏముటుందయ్యా! ఎనభై ఏండ్లు పైనబడ్డ వృద్ధురాలు జూదమాడాలా ఏమిటి?" అన్నాడు నరుమోవ్.

"అంటే ఆవిడవిషయం నీకేమీ తెలియదన్న మాట?"

"నిజంగా నాకేమీ తెలియదు!

అయితే నన్ను చెప్పనీయి" అంటూ టామ్‌స్కీ చెప్పడం మొదలుపెట్టాడు: "సుమారు అరవై ఏండ్లక్రితం మా నాయనమ్మ పారిస్ వెళ్ళింది, అక్కడొక పెద్దవెలుగు వెలిగించివచ్చింది. అక్కడివారంతా ఆవిడను 'మాస్కో మోహిని' అనేవారు. ఆవిడను చూడడంకోసం పడి

చచ్చేవారు. రిషెలూ ఉన్నాడే, ఆయన ఆవిడకోసం పడి గావులు కాశాడట. కాని మా నాయనమ్మ అతనిపట్ల చాలా కఠినంగా ప్రవర్తించింది. చివరకతను ఆత్మహత్య చేసుకున్నాట్ట.

"ఆరోజుల్లో స్త్రీలు * ఫారో ఆడేవారు. ఒక నాడు ఆవిడ డక్ డీ ఆర్లియన్సుతో ఈ ఆట ఆడుతూ చాలాడబ్బు- పెద్దమొత్తం బాకీపడింది!- ఆ తరువాత ఆవిడ ఇంటికివచ్చి తన ముస్తాబంతా విప్పుకుంటూ మరో మాటు తను నష్టపోయిన సొమ్ము లెక్కచూచుకుంది. పిమ్మట మా తాతగారితో ఆ బాకీమొత్తం చెల్లించివేయ మని చెప్పింది.

కీర్తిశేషులైన మా తాతగారున్నారే - ఆయన మా నాయనమ్మకు ఒదిగి ఒదిగి ఉండేవాడని నాకు జ్ఞాపకం. ఇంటి వ్యవహారాలన్నీ ఆయనే చూస్తుండేవాడు. ఆవి

---

* ఇదొక రకమైన పేకాట. అదృష్టంమీద ఆధారపడి ఉన్న ఆటఇది. పేక కలిపి ఒక్కొక్కముక్కే పంచుతారు. ఒక వరుసక్రమంలో ఇన్నో ముక్క ఫలానాదైతే పందెం ఇంత అని పందెం ఒడ్డుతారు. ఆ ముక్కవస్తే పందెం గెలుస్తుంది. లేకపోతే పోతుంది.

— అనువాదకుడు.

డంటే చచ్చేంతహడలు కూడా. కాని ఈమాటు ఇంత డబ్బు పోగొట్టిందని వినేసరికి ఆయనకు వళ్ళు వణుకు పుట్టిందట. ఎక్కడలేని ఆవేశంతో రెచ్చిపోయి లెక్కలు తీసి బయటపెట్టాడు. పారిస్‌వచ్చిన ఆనుమానాల్లోనూ తాము అయిదులక్షలు తగలేశామనీ, తమకెక్కడ మాస్కో, సారటోవ్ ఎస్టేట్లేమీ లేవనీ అన్నాడు. ఆవిడ జూదంలో పోగొట్టిన డబ్బు చిల్లిగవ్వకూడా ఇవ్వనని నిర్మొహమాటంగా చెప్పేశాడు. దాంతో మా నాయనమ్మ ఆయన్ను నూరునుగ్గించి పోసింది. ఆయన్ను దగ్గరికికూడా చేరనీయకుండా తన పడకగదిలోకిపోయి తలుపు బిడాయించుకుంది.

"ఆ మరుసటిరోజు ఆవిడ ఆయనకోసం కబురు పంపింది- ఇటువంటి వ్యవహారాలు అదుపులో పెట్టడంకోసమైనా ఆయనీపాటికి కొంత శాంతించివుంటాడని అనుకుంది. కాని ఆయనింకా బిర్రబిగిసివున్నాడు. అప్పుడావిడ తన జీవితంలో తొలిసారిగా ఆయన్ను ఒప్పించడానికి, సంజాయిషీలు, సమాధానాలు ఇచ్చుకున్నది. అప్పులు సొప్పులు ఉండక తప్పవని చెప్పింది. ప్రభువుకూ పకీరుకూ ఎప్పుడూ తేడాఉండనే ఉంటుందన్నది. ఎంతో నిగర్వంగా వివరించి చెప్పింది. అలాగైనా తలవంపులు తెచ్చుకుని

తనపద్ధతి మార్చుకుంటాడేమో అనుకుంది. కాని నిరుప
యోగం! మా తాతగారు మొండికేశాడు. ఆయన కాదూ
అంటేకాదు. అంతే! ఇహ దానికి తిరుగులేదు! మా
నాయనమ్మకు ఏంచేయాలిసిందీ పాలుపోలేదు.

"ఆవిడ స్నేహితుల్లోకల్లా ఎన్నదగిన వ్యక్తి ఒకా
యన ఉన్నాడు. చాలా అద్భుతమైన, అసాధారణమైన
వ్యక్తి ఆయన. కామ్‌టే సెయింట్ జర్మెయిన్ పేరు మీరు
వినేఉంటారు. ఆయన్ను గురించి అద్భుతమైన కథలు
చెప్పడం మీ కందరికీ తెలుసు. అనేక గారడీవిద్యలు
చేస్తూ దేశాటనంచేసిన యూదుడనీ, మృతసంజీవినీ
విద్యను, తత్వజ్ఞానశిలను, ఇంకా ఇలాటివెన్నెన్నో కని
పెట్టిన వ్యక్తి అనికూడా మీకు తెలుసు. కాని అందరూ
అతన్ని గేలిచేస్తుండేవారు. వట్టి డంబాచారం తప్ప అతని
కేమీ తెలియదనీ అంటుండేవారు. కేసనోవా తను
వ్రాసిన చరిత్రలో అతనొక గూఢచారి అని వర్ణించాడు.
ఏది ఏమైనప్పటికీ అతని అద్భుతాలమాట అలాఉంచి,
వ్యక్తిగా విచారిస్తే అతను చాలా మర్యాదస్థుడిలాగా కని
పించేవాడనీ, సమాజంలో తిరగనేర్చినవాడనీ చెపుతారు.
మానాయనమ్మ మాత్రం ఈనాటివరకూ అతనంటే
అమితమైన ప్రేమతో ఉంటోంది. అతన్ని గురించి ఏమాత్రం

అమర్యాదగా చెప్పినా, పల్లెత్తుమాటన్నా ఆవిడ సహించదు. అతనిదగ్గర కావలసినంత డబ్బు మూలుగుతూ ఉందనికూడా ఆవిడకు తెలుసు. అంచాత ఈ సందర్భంలో అతని సహాయం అపేక్షించాలని నిశ్చయించుకుంది. తక్షణమే వచ్చి తనను కలుసుకోవలసిందని కోరుతూ అతనికి జాబు వ్రాసింది.

"వెంటనే విచిత్రమయిన ఆవృద్ధుడు ఆవిడను చూడడానికి వచ్చాడు. ఆవిడదుఃఖాక్రాంతురాలై ఉండడం గమనించాడు. భర్త క్రూరమైన ప్రవర్తనను గురించి ఆవిడ అతనికి వివరించి చెప్పింది. పరిపరివిధాల వాపోయింది. చివరకు అతనొక్కడిమీదనే ఆశపెట్టుకుని ఉన్నానసీ, అతని స్నేహంమీద, ఔదార్యంమీద ఆధారపడి ఉన్నాననీ చెప్పింది.

"సెయింట్ జర్మెయిన్ ఆలోచించాడు. 'సరే ఈ సొమ్ము మొత్తం నేను యిస్తాను" అన్నాడతను. 'కాని మళ్ళీ ఆడబ్బు తిరిగి ఇచ్చేవరకూ నీకు నిద్రపట్టదని నాకు తెలుసు. పైగా నీవు కొత్తచిక్కులు కొనితెచ్చుకోవడం నా కేమాత్రం ఇష్టంలేదు. నీవు బాకీపడిన డబ్బు మళ్ళీ గెలుచుకోవడానికి వేరేమార్గం ఉంది' అన్నాడు.

"'కాని నా ప్రియమైన కౌంటె' 'ఇహ మా దగ్గర ఏమాత్రం డబ్బు లేదు' అంటూ మా నాయనమ్మ జవాబు చెప్పింది. 'డబ్బే ఉండవలసిన అవసరం లేదు.' అన్నాడతను మళ్ళీ: 'దయచేసి నే చెప్పేది విను.' అంటూ అతను మనకెవ్వరికీ తెలియని ఒక రహస్యం మా నాయనమ్మకు చెప్పాడు..."

ఇది వినేసరికి యువకుడైన జూదగాళ్ళందరికీ మరింత ఆసక్తి పుట్టుకొచ్చింది. టామ్‌స్కీ పైపు వెలిగించాడు. రెండు గుక్కలు పీల్చి మళ్ళీ చెప్పడం మొదలు పెట్టాడు:

"ఆ రాత్రే మళ్ళీ మా నాయనమ్మ వెర్‌సెయిల్స్‌లో ప్రత్యక్షమైంది. జూదమాడడానికి కూచుంది. డక్ డీ ఆర్లియన్సు కూడా వచ్చాడు. ఇరువురూ ఆటకు కూచున్నారు. తను బాకీపడిన సొమ్ము తీసుకరానందుకు మా నాయనమ్మ అతనికేదో కొంచెం క్షమాపణలు చెప్పుకుంది. నమ్మడానికి వీలుగా ఓ చిన్నకథ అల్లి చెప్పింది. అతనికి ప్రత్యర్థిగా కూచుని పేకాడడం ప్రారంభించింది. ఆవిడ, ముందు మూడు ముక్కలు ఎన్నుకున్నది. వాటి మీద పందెం ఒడ్డుతూ ఒకదాని తరువాత ఒకటి ఆడడం

మొదలుపెట్టింది- ఆ మూడూ గెలుపుముక్కలే అయి నాయి. ఇంకేం? మళ్ళీ మానాయనమ్మ బాకీపడిన డబ్బంతా ఒక్కదెబ్బలో గెలుచుకుంది."

"కేవలం అనుకోకుండా వచ్చిఉంటుంది!" అన్నారు అతిథుల్లో ఒకరు.

"కట్టుకథ!" అన్నాడు హెర్మన్.

"బహుశా ముక్కలు గుర్తుండివుంటాయి!" అన్నారు మరొకరు.

"అవేవీకావు" అని హుందాగా సమాధానం చెప్పాడు టామ్‌స్కీ.

"ఏమిటీ!" అన్నాడు నరుమోవ్. "మీనాయనమ్మ వరసాగ్గా మూడుముక్కలమీద పందెం ఒడ్డి గెలుచుకోవడమేమిటి, దానిలోని మర్మం ఏమిటో ఇంత వరకూ నీవు తెలుసుకోలేక పోవడమేమిటి!" అని అడి గాడు.

"దాని తస్సాదియ్యా! అదంత సులభమైన విషయంకాదయ్యా!" అని జవాబిచ్చాడు టామ్‌స్కీ. "ఆవిడకు నలుగురు కొడుకులు. వారిలో ఒకాయన మాతండ్రిగారు. ఈ నలుగురూకూడా జూదంలో ఆరి

తేరిస ఘటాలు. అయినా వారిలో ఏఒక్కరికీ కూడా ఆ మర్మంఏమిటో ఆవిడ విప్పిచెప్పింది కాదు. అయితే దీనివల్ల వారికికాని నాకుకాని వచ్చిన చెడుగేమీ లేదనుకోండి. కాని ఈ విషయం యదార్థమని మాపెత్తండ్రి గారైన కౌంట్ ఇవాన్ఇలియిచ్ నాతో చెప్పారు, నా దగ్గర ఒట్టువేయించుకుని. కీర్తిశేషుడైన చాప్లిటిస్కీ ఉన్నాడే- ఆయన లక్షలకొద్దీ డబ్బు నీళ్ళలా పారబోసి చివరకు బికారిఅయి చచ్చిపోయాడు. ఆయన చిన్నతనంలో ఉండగా ఒకమాటు మూడులక్షల రూబుళ్ళు పోగొట్టుకున్నాడు. అది జోరిక్ కని నాకు జ్ఞాపకం. అప్పుడు చాప్లిటిస్కీ చాలా నిరాశచెందాట్ట. చిన్నవాళ్ళు వేసే వెర్రివేషాలు మా నాయనమ్మకు సుతరామూ గిట్టవు. అయినా అప్పుడావిడ అతని పరిస్థితిచూచి జాలిపడింది. ఆ మూడుగెలుపు ముక్కలపేర్లూ అతనికి చెప్పింది. వాటిమీద వరుసగా పందెంఒడ్డి ఆడమని చెప్పింది. కాని అతనిచేత మరెప్పుడూ జూదమాడనని ప్రమాణం చేయించుకుంది. తరువాత చాప్లిటిస్కీ తనను ఓడించిన వ్యక్తి దగ్గరికివెళ్ళి అతనితో ఆటకు కూచున్నాడు. మా నాయనమ్మ చెప్పిన ఆ మూడుముక్కల మీద పందెం ఒడ్డి ఆడాడు. మొదటి ముక్కమీద

యాభైవేలు పందెంవేసి గెలుచుకున్నాడు. తరువాత ముక్కలమీద పందెం ఇబ్బడి ముబ్బడిచేసి చివరకు నష్టపడిన సొమ్మును యావత్తూ పూడ్చుకుని బయటపడ్డాడు...

"సరే. ఏమైనా ఇహ ఇప్పుడు మనం విశ్రాంతి తీసుకునేవేళయింది- పావుతక్కువ ఆరుగంటలు" అని చెప్పి టామ్‌స్కీ తనకథ ముగించాడు. నిజానికి అప్పటికే బాగా తెల్లవారిపోయింది. ఆ యువకులంతా తమతమ గ్లాసుల్లో మిగిలిఉన్న పానీయం త్రాగేసి ఎవరితోవన వారు వెళ్ళిపోయారు.

# 2

వృద్ధురాలైన కౌంటెస్ - తన విశ్రాంతి మందిరంలో అద్దంముందు కూచుని ఉంది. ఆవిడచుట్టూ ముగ్గురు పరిచారికలు పోగయిఉన్నారు. ఒక పరిచారిక పౌడరు డబ్బా పట్టుకుని ఉంది. రెండో ఆవిడ తలపిన్నుల పెట్టె పట్టుకునిఉంది. మూడో ఆవిడ ఎర్రటి రిబ్బన్లతో ఉన్న ఒక ఎత్తుటోపీ చేతపుచ్చుకుని ఉంది. కౌంటెస్‌లో ఎక్కడా వెదికిచూచినా సౌందర్యంయొక్క పోలుకువలే కనిపించడంలేదు - ఆవిడ సౌందర్యం ఏనాడో వాడిపోయింది. అయినప్పటికీ ఆవిడ తన యౌవననాటి అలవాట్లను తూ. చ. తప్పకుండా ఇప్పటికీ అనుసరిస్తూ ఉంది. 1770 నాటి ఫ్యాషన్లు అవి. అరవైఏండ్ల క్రితం ఆపద్ధతిలో అలంకరించుకోవడానికి ఎంతగా శ్రమపడేదో ఇప్పటికీకూడా అలా ముస్తాబుచేసుకోవడం కోసం వీలైనంత ఎక్కువకాలాన్ని, శ్రమను వృథాపుచ్చుతూ

వచ్చింది. ఆవిడకు చెలికత్తె అయిన ఓయువతి అల్లిక నల్లిగం ముందు పెట్టుకుని కిటికీప్రక్కన కూచునిఉంది.

అప్పుడే యువకుడైన ఒక ఆఫీసరు అక్కడికి వచ్చాడు. కౌంటెస్‌నుచూచి "నమస్కారమమ్మా!" అన్నాడు. తరువాత ఆ యువతివంక తిరిగి "శుభోదయం సుదాంలీసా!" అన్నాడు. మళ్ళీకౌంటెస్‌తో "మిమ్మల్ని ఒక విషయం అర్థించండానికి వచ్చానమ్మా." అని చెప్పాడు

"ఏమిటది పాల్?" అని అడిగింది కౌంటెస్:

"నా స్నేహితుడొకణ్ణి మీకు పరిచయం చేయ డానికి, శుక్రవారంనాడు జరిగే బాల్‌డాన్సుకు తీసుక రావడానికి అనుమతించడమ్మా."

"నీవతన్ని నేరుగా నృత్య మందిరం దగ్గరికి తీసుకరా అక్కడే నా కతన్ని పరిచయం చేదువుగాని. పోతే నిన్న జరిగిన- దగ్గరికి నీవు వెళ్ళావా?"

"ఆ, వెళ్ళాను! ఎంతో ఉల్లాసంగా ఉందక్కడ. అయిదు గంటలదాకా నృత్యంచేశాం: ఎవెట్‌స్కాయా ఎంత ముచ్చటగా ఉంది!"

"అబ్బాయీ! ఆవిడనుచూస్తే ఏముందీ? నీవు నిజంగా చూడాలంటే ఆవిడ నాయనమ్మ డార్యా

పెట్రోవ్నా రాకుమారిని చూడాలి. బహుశా ఇప్పుడా విడ ఎంతో వృద్ధురాలై ఉంటుందనుకుంటాను."

"వృద్ధురాలా!" అన్నాడు టామ్‌స్కీ పరధ్యా సంగా. "ఆవిడ చనిపోయి ఇప్పటికి ఏడేండ్లయినా అయి ఉంటుంది" అన్నాడు.

అల్లికపని చేసుకుంటున్న ఆ అమ్మాయి తలెత్తి చూచింది. టామ్‌స్కీ వంక చూచి సైగచేసింది. ఆవిడ సమకాలీకులు ఎవరు చనిపోయినా, ఆవిషయం ఎప్పుడూ ఆ వృద్ధురాలితో చెప్పకుండా దాచిపెడుతూ వచ్చారన్న సంగతి అప్పుడతనికి జ్ఞాపకంవచ్చింది. నాలిక కొరుక్కు న్నాడు. కాని కౌంటెస్ ఈవార్తవిన్నది. నిజంగా ఆవిడ కిది కొత్తవార్తే. ఎంతో ఉదాసీనతతో ఈవిషయం స్వీక రించింది.

"ఆవిడ చనిపోయిందా!" అన్నది కౌంటెస్ మళ్ళీ. "ఆవిషయం నాకు తెలియదే! మేమిరువురమూ ఒకే మాటు చక్రవర్తినికి సఖురాండ్రగా నియమింపబడ్డాం. మమ్ములను చక్రవర్తినికి పరిచయం చేసినప్పుడు......"

ఇలాఅంటూ కౌంటెస్ తనకథను తన మనుమడికి నూరోపర్యాయం చెప్పింది.

"సరే, పాల్"అన్నదావిడ కథచెప్పటంపూర్తి చేసి "ఇహా నేను వేవడానికి కాస్త తోడుపట్టు. లీసా! నా నశ్యపుడబ్బీ ఏదమ్మా?" అని అడిగింది.

తరువాత కౌంటెస్ తన పరిచారకులు వెంటరాగా ముస్తాబు ముగించుకోడానికి తెర వెనకాలకు వెళ్ళింది. టామ్‌స్కీ, ఆ అమ్మాయి మాత్రం ఉండిపోయారు.

"నీవు ఎవర్ని ఆవిడకు పరిచయం చేయాలనుకుంటున్నది?"అని నిమ్మళంగా అడిగింది లిసవెటా ఇవనోవ్నా.

"నరుమోల్‌ను. నీ కతను తెలుసునా?"

"లేదు. అతను సైనికోద్యోగా లేక సాధారణ ఉద్యోగా?

"సైనికోద్యోగే."

"ఇంజనీరా?"

"కాదు. అశ్వికదళంలో అఫీసరు. అతను ఇంజనీరని ఎలా అనుకున్నావు?"

ఆ అమ్మాయి పకాలుమని నవ్వింది. కాని ఒక్క మాట అయినా సమాధానం చెప్పలేదు.

"పాల్!" అని తెర వెనకాలనుంచి కౌంటెస్ పిలిచింది. "నా కొక కొత్తనవల పంపిస్తూ. కాని, దయచేసి ఈ కాలపు నవలమాత్రం పంపకు" అన్నది.

"అంటే ఏమిటి మీ ఉద్దేశం బామ్మా?"

అంటే మరేమీ లేదు. నవలలో కథానాయకుడు తన తండ్రినికాని తల్లినికాని గొంతుపిసికి చంపడంలాంటివి ఉండకూడదు. నవలలో ఎక్కడా శవాలు నీళ్ళలో తేలడం మొదలైనవికూడా ఉండకూడదు. నీళ్ళలో పడి చచ్చినవాళ్ళంటే నాకు తగని భయం!"

"ఈ రోజుల్లో అలాంటి విషయాలు లేని నవలలే లేవు, ఒక్క రష్యన్ నవలలు తప్ప. అవి పంపమంటే పంపుతాను."

"ఏమిటీ! రష్యన్ నవలలేమైనా ఉన్నాయా? ఉంటే ఒకటి పంపునాయనా, ఎలాగైనా ఒకటి పంపిద్దూ!"

"సరే బామ్మా- ఇహ నాకు సెలవిప్పించండి, చాలా తొందరపనిలో ఉన్నాను. సెలవు, లిసవెటా ఇవనోవ్నా! నరుమోవ్ ఇంజనీరని ఎలా అనుకోగలిగావు?"

ఇలా అని టామ్‌స్కీ అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

లిసవెటా ఇవనోవ్నా ఒంటిగా మిగిలిపోయింది. ఆవిడ తన అల్లికపని ఆపి కిటికీలోనుంచి బయటికి

చూడడం మొదలుపెట్టింది. వీధి అవతల కొసన మూల తిరుగుళ్ళో యువకుడైన ఒక ఆఫీసరు ఆవిడకు కని పించాడు. సిగ్గుతో ఆవిడ చెక్కిళ్ళు ఎర్రబారాయి. మళ్లీ ఆవిడ తనపనిలో నిమగ్నురాలైంది. గుడ్డకు తాకేంత దగ్గరిగా తలవంచుకుని కుట్టుపని చేసుకోవడం మొదలు పెట్టింది. అంతలోనే కౌంటెస్ పూర్తిగా ముస్తాబు చేసు కుని ఇవతలికొచ్చింది.

"బండికోసం కబురు చెయ్యి లిసంకా" అన్నదావిడ. "మనం కాస్త అలా బయటికి వెడదాం." అన్నది.

లీసా తన కుట్టుపనిలోనుంచి లేచి అదంతా అవ తల సర్దిపెట్టడం మొదలుపెట్టింది.

"అమ్మాయీ! నీకేమైనా చెవుడొచ్చిందా ఏమిటే? వెంటనే బండి సిద్ధం చెయ్యమని చెప్పు" అని కేకలు వెయ్యసాగింది కౌంటెస్.

"అలాగేనమ్మా" అంటూ ఆ పిల్ల నిమ్మళంగా సమాధానం చెప్పి, వెంటనే హాల్లోకి పరుగెత్తింది.

ఒక సేవకుడు కొన్ని పుస్తకాలు తీసుకుని అక్క డికి వచ్చాడు. కౌంటెస్‌కు అందచేయమని పావెల్ అలె గ్జాండ్రొవిచ్ పంపిన పుస్తకాలవి.

"మంచిది, మంచిది! అతనికి నా కృతజ్ఞతలు తెలుపు" అన్నది కౌంటెస్ సేవకునితో. తరువాత "లీసా! లీసా! ఎక్కడికి వెడుతున్నావు నీవు?" అని అడిగింది.

"దుస్తులు వేసుకోవడానికి" అని జవాబిచ్చింది లీసా.

"అమ్మాయీ! ఆ పనికి కావలసినంత వ్యవధి ఉంది. ఇక్కడ కూచో. ఆ పుస్తకాలలో మొదటి సంపుటం తెరిచి, నాకు కాస్త చదివి వినిపించు..."

ఆ అమ్మాయి పుస్తకంతీసి కొద్దిపంక్తులు చదివి వినిపించింది.

"బిగ్గరగా!" అన్నది కౌంటెస్. "అమ్మాయీ! ఏమిటయిందే నీకు? నీ గొంతుకూడా పోయిందా ఏమిటే? ఒక్కక్షణం ఆగు – ఆస్టూలుబల్ల నాకు దగ్గరిగా! జరుపుకో. ఇంకా దగ్గరిగా! ఊఁ. సరేనా?" అన్నది.

లిసవెటా ఇవనోవ్నా మరిరెండు పేజీలు చదివి వినిపించింది కౌంటెస బద్ధకంగా ఆవులించింది.

"సరే. ఇహ ఆ పుస్తకం అక్కడ పడెయ్యి"అన్నది. "అంతా అర్థంలేని చెత్త! ఆ పుస్తకం తిరిగి పావెల్

రాకుమారుడికి పంపించెయ్యి. సరే. బండివిషయం ఏమైంది ?''అన్నది.

"బండి సిద్ధంగా ఉంది'' అని చెప్పింది లిసవెటా ఇవనోవ్నా కిటికీలోనుంచి బయటికి చూస్తూ.

"మరినీవు బట్టలు మార్చుకోలేదేం ?'' అని అడిగింది కౌంటెస్. "నీ వెప్పుడూ ఇంతే అమ్మాయీ, నీ కోసం నేను కనిపెట్టుకుని ఉండాలి. అబ్బబ్బ ! నా ప్రాణం అన్నుపడుతోంది !''అన్నది.

లీసా తనగదిలోకి పరుగెత్తింది. రెండు నిముషాలయిందో లేదో అంతలోనే కౌంటెస్ తన బలంకొద్దీ పిలుపు గంటకొట్టడం మొదలుపెట్టింది. వెంటనే ముగ్గురు పరిచారికులు ఒకే వాకిలిగుండా పరుగెత్తుకుంటూ లోపలికి వచ్చారు. మరో ద్వారంలోనుంచి ఒక సేవకుడు కూడా వచ్చాడు.

"పిలవగానే రారేం?'' అని అరిచింది కౌంటెస్. "వెళ్ళి లిసవెటా ఇవనోవ్నాతో నేను కనిపెట్టుకుని ఉన్నానని చెప్పండి'' అన్నది.

లిసవెటా ఇవనోవ్నా పై ఉడుపు ధరించి హేటు పెట్టుకుని వచ్చింది.

"ఎలాగైతేనేం వచ్చావు!" అన్నది కౌంటెస్. "ఎంత ఇదిగా ముస్తాబు చేసుకున్నావు! దేనికోసం? చిత్రంగా ఉందే! ఎవరిని వశంచేసుకోవడానికి అమ్మాయీ, ఇదంతానూ? వాతావరణం ఎలాఉంది? బాగా గాలి కొడుతున్నట్లుంది" అన్నది.

"గాలి క్షణమేలేదు దొరసానీ! అంతా ప్రశాంతంగా ఉంది" అని సమాధానం చెప్పాడు సేవకుడు.

"నీవెప్పుడూ అంతే! నోటికేమాట వస్తే ఆమాట అనేస్తావు. ఏదీ! ఆ కిటికీ అద్దం తెరిచిచూడు. నాకు తెలుసు. గాలి జోరుగా ఉంది. అందులోనూ ఈదురుగాలి! ఆ బండి తిరిగీ పంపించెయ్యండి. మనం బయటికి వెళ్ళడం లేదు లీసా. ఇహ నీవాముస్తాబు తీసేయవచ్చు."

"ఇదీ నా బ్రతుకు!" అనుకున్నది లిసవెటా ఇవనోవ్నా తనలో.

నిజానికి లిసవెటా ఇవనోవ్నా చాలా దురదృష్ట వంతురాలు. "పరాయిపంచల్లో ధర్మపిండం తిని బ్రతకడం కంటె బాధాకరమైన విషయం మరొకటి ఉండదు" అన్నాడు డాంటే. "తనదికాని ఇంట్లో మసలడం అడుగడుగునా గండమే" అన్నాడు. పాపం, అభాగ్యురాలైన

ఆపిల్ల ఒక శ్రీమంతురాలైన వృద్ధురాలిని ఆశ్రయించుకుని జీవించడం ఎంతదుఃఖకరమైన విషయమో ఎవరెరుగుదురు? కౌంటెస్—హృదయం నిజానికి కఠినమైనదికాదు. కాని ఆవిడ చపలచిత్తురాలు. సోమరితిండి తిని ముద్దుమురిపెంగా పెరిగిచెడిపోయిన అనేకమంది సమాజంలోని స్త్రీలవంటిదే ఆవిడకూడాను. పిల్లికిబిచ్చంపెట్టని మనిషి. చిన్నినాపొట్టకు శ్రీరామరక్ష అనుకుంటూ, అహంకారంతో జీవించే స్త్రీ. దీర్ఘకాలం జీవితంలో అన్నీ అనుభవించి ఇప్పటికీ అదే పరిస్థితిలో జీవిస్తూ ప్రస్తుతంతో సంబంధంలేని అనేకమందికిమల్లేనే ఆవిడకూడా. ఆవిడ ఎప్పుడూ ఉన్నత సమాజంలో తిరుగుతూ వారి వెర్రివిలాసాలలో, కులాసాలలో పాలుపంచుకుంటూ ఉంటుంది. బాల్ డాన్సులకు హాజరవుతుంది. పూర్వకాలపు తరహాలో, కృత్రిమమైన అలంకారాలు, ముస్తాబులు చేసుకుని అక్కడోకమూల కూచుంటుంది. బాల్‌రూం అంతటికీ గుప్తమైన, ప్రధానమైన ఆభరణంగా వెలుగొందుతూ ఉంటుంది అతిథులందరూ అక్కడికి రాగానే ఆవిడ దగ్గరికి వెళ్ళి సవినయంగా తలలు వంచుతారు, అదేదో అనాదినుంచి వస్తున్న ఆచారమైనట్లు. కాని ఆ తరువాతమాత్రం ఎవరూ ఆ విషయం పట్టించుకోరు. నగరం మొత్తాన్నీ ఆవిడ తన

గృహానికి ఆహ్వానిస్తుంది. వారిలో ఏవక్కరిముఖంకూడా ఆవిడ గుర్తించలేకపోయినప్పటికీ, అందరినీ కచ్చితమైన మర్యాదలతోను, ఆచారాలతోను స్వీకరించి పరామర్శ చేస్తుంది. లెక్కలేనంతమంది పనివాళ్ళు, దాసదాసీలు ఆవిడ ఇంటిముందు హాల్లోనూ, తక్కిన గదులలోనూ పడిఉంటున్నారు. తినికొన్నేకిక్క అక్కడే పండిపోతున్నారు. ఎవరిష్టమొచ్చినట్లువారు చూస్తూ, ఒకరితో ఒకరు పోటీ పడుతూ, పోరాడుతూ చావసిద్ధమై ఉన్న ఆ వృద్ధురాలిని దోచుకతింటున్నారు.

లిసవెటా ఇవనోవ్నా ఆ గృహానికి బలి అయిపో యింది. ఆ అమ్మాయి టీ పోసి అందిస్తుంది. పంచదార ఎక్కువ ఖర్చుచేసిందని తిట్లు తింటుంది. బిగ్గరగా నవలలు చదివి వినిపిస్తుంది. ప్రతి రచయిత చేసిన తప్పులన్నింటికీ తనే బాధ్యత నిర్వహించి నేరస్థురాలవుతుంది. ఆ వృద్ధు రాలు బయటికికాని, విహారార్ధంకాని వెళ్ళినప్పుడు ఆవిడవెంట వెడుతుంది. ఆవిడ అడిగే ప్రతి ప్రశ్నకూ— మబ్బుపట్టిందో లేక ఎండ కాస్తున్నదో - గాలి ఎలా ఉందో, రోడ్డు సరిగా ఉందో లేదో; అన్నిటికీ సమాధా నాలు చెప్తుతుంది. ఆ పిల్లకు కొంత జీతం ఏర్పాటు

చేయబడింది. కాని పూర్తి జీతం ఎన్నడూ పుచ్చుకోలేదు. పైగా తక్కినవారిలాగానే - అంటే చాలా కొద్దిమందికి వల్లే నే ముస్తాబు చేసుకోవలసి ఉంది ఆ పిల్ల. ఇహ సమాజంలో ఉన్నప్పుడు ఆ పిల్ల ఎంత దీనావస్థలో ఉంటుందో చెప్పలేం. ప్రతి ఒక్కరికీ ఆ అమ్మాయి తెలుసు. కాని ఎవరూకూడా ఆ పిల్ల విషయం పట్టించు కోరు. బాల్‌డాన్సులు జరిగే సమయంలో క్వాడ్రిల్లీ నృత్యంలో జత తక్కువైనప్పుడు మాత్రమే ఆ పిల్ల నృత్యం చేస్తుంది. నాట్యం మధ్యలో స్త్రీలు ఎప్పుడు తమ ముస్తాబులు చెదిరిపోయినా, పౌడరు మొదలైనవి తొలిగి పోయినా అవి సరిదిద్దుకోడానికి గదుల్లోకి వెడతారు. అప్పుడల్లా ఆ పిల్లను చెయ్యిపుచ్చుకొని వెంటతీసుకెడ తారు. అంచాత ఆ అమ్మాయి ఎప్పటికప్పుడు తన పరి స్థితి గమనించుకుంటూ ఎప్పుడు తను బయటపడతానా అని ఆదుర్దాగా కనిపెట్టుకుని ఉంటుంది. కాని లిసవెటా ఇవనోవ్నా తక్కిన యువతులకంటె వందరెట్లు అందం గాను, ఆకర్షణీయంగాను, ఉత్సాహంగాను ఉన్నప్పటికీ యువకులెవ్వరూ ఆ అమ్మాయిని కన్నెత్తిచూడరు. ఆ పిల్లకంటె అన్నివిధాల తక్కువగాను, నిరుత్సాహంగాను తలబిరుసుతనంగాను ఉండే కన్యలతోనే ఎప్పుడూ నాట్యం

చేస్తుంటారు. ఎన్నితడవలు ఆ అమ్మాయి విశేషభోగాల తోను, విసుగ్గాను ఉన్న డ్రాయింగ్ రూమ్‌ను నిశ్శబ్దంగా వదిలి దరిద్రం తాండవంచేసే తన గదిలోకివచ్చి ఏడుస్తూ కూచుంది! కాగితాలంటించిన ఒక అరగోడ, దానిలోపల ఒక బీరువా, ఒక చిన్న అద్దం, రంగు వేసిన ఒక మంచం, ఒక ఇత్తడి సెమ్మెమీద గుడ్డిగా వెలుగుతున్న ఒకకొవ్వొత్తి దీపం! ఇదీ ఆపిల్లగది.

ఒకనాడు—అంటే ఈ కథ మొదట్లో చెప్పిన పేకాటనాటి రాత్రికి ఒకటి రెండురోజుల తరువాత, ప్రస్తుతం మనం వదిలిపెట్టిన దృశ్యానికి ఓవారం రోజులు ముందు, లిసవెటా ఇవనోవ్నా కుట్టుపని చేసుకుంటూ కిటికీప్రక్కన కూచునిఉంది. అప్పుడాపిల్ల కిటికీలోనుంచి వీధిలోకి చూడడం తటస్థించింది. ఆ సమయంలో ఇంజనీరు దుస్తుల్లో ఉన్న ఒక యువకుడు వీధిలో నిశ్చలంగా నిలబడి తన కిటికీవైపే తదేకంగా చూస్తూఉండడం ఆ అమ్మాయి కంటపడింది. వెంటనే తల వాల్చుకుని తన పనిలో నిమగ్నురాలైంది. ఓ ఆయిదునిముషాల తరువాత మళ్ళీ వీధిలోకిచూచింది, యువకుడైన ఆ ఆఫీసర్లతో సరసాలాడడం అలవాటులేదుకాబట్టి ఆ అమ్మాయి

కిటికీలోనుంచి చూడడం మానేసి మళ్ళీ తన కుట్టుపని చేసుకోవడం మొదలుపెట్టింది. అలావంచిన తల ఎత్తకుండా రెండుగంటలసేపు కుట్టుకుంది. భోజనం వడ్డించారు. ఆ పిల్ల అక్కడనుంచి లేచి అల్లికపని అవతల సర్దిపెట్టడం మొదలుపెట్టింది. తరువాత కిటికీలోనుంచి వీధిలోకి చూచింది. ఆ ఆఫీసరు ఇంకా అక్కడే ఉన్నట్లు గమనించి ఆశ్చర్యపోయింది. అదేదో విపరీతమైన విషయంగా తోచిందాపిల్లకు. భోజనం అయిన తరువాత సంకటంగా కిటికీదగ్గరికి వెళ్ళింది. కాని ఇప్పుడా ఆఫీసరు అక్కడలేడు—తరువాత ఆ అమ్మాయి అతన్ని గురించి ఆలోచించడం మానుకుంది...

రెండురోజుల తరువాత ఆ అమ్మాయి కౌంటెస్‌తో కలిసి బయటికివెడుతూ బండ్లో ఎక్కబోతూ ఉండగా మళ్లీ ఆ వ్యక్తి కంటపడ్డాడు సరిగ్గా అతను తల వాకిట వసారాలో నిల్చునిఉన్నాడు. కాలరు ఎత్తిపెట్టుకుని ముఖంకనిపించకుండా కప్పుకున్నాడు. అతని హేటు క్రిందినుంచి నల్లటికళ్ళు రెండు తళతళమెరుస్తున్నాయి. లిసవెటా ఇవనోవ్నా ఎందుకో తనకే తెలియకుండానే భయవిచలితురాలైంది. కారణం ఎరుగని ఆందోళనతో మెల్లగా బండ్లో ఎక్కికూచుంది.

తిరిగి ఇంటికిరాగానే మళ్ళీ కిటికీ దగ్గరికి పరు గెత్తింది. ఆఫీసరు తన మామూలుచోటనే నిలవబడి ఉన్నాడు. అతని దృష్టంతా ఆ పిల్లమీదనే ఉంది. ఆవిడ విచిత్రమైన బాధతోను, ఎన్నడూ ఎరగని ఆందోళన తోను అక్కడనుంచి అవతలికి వెళ్ళింది.

అప్పటినుంచీ అతను ఒక్కరోజుకూడా సంధు పోకుండా ఏదో ఒక నిర్దిష్టమైన వేళప్పుడు ఆ ఇంటి కిటి కీల క్రింద కనిపిస్తూ వచ్చాడు. వారిద్దరి మధ్య ఒక విచిత్రమైన సంబంధం అల్లుకుంది. ఆ అమ్మాయి తన కుట్టుపనిలో కూచున్నప్పుడు అతను వచ్చినట్లుగా అనిపించి తల ఎత్తి చూచేది. ప్రతిరోజూ అతనివంక ఎక్కువసేపు చూస్తూ ఉండేది. ఆవిడ ఇలా చేస్తున్నందుకు ఆ యువ కుడు కృతజ్ఞత చూపుతున్నట్లు కనిపించేవాడు. తమ చూపులు కలుసుకుంటున్నప్పుడల్లా వెలవెలబోతున్న అతని చెక్కిళ్ళపై ఎర్రని సిగ్గుతెరవచ్చి కమ్ముకోవడం ఆవిడ గమనిస్తూనే ఉంది. యౌవనం తొణికే చురుకైన చూపులతో అతన్ని చూస్తూ వచ్చింది. ఇలా ఒక వారంరోజులు గడచినతరువాత ఆవిడ అతన్ని చిరు నవ్వుతో అహ్వానించడం మొదలుపెట్టింది...

టామ్‌స్కీ తన స్నేహితుణ్ణి పరిచయం చేస్తానని కౌంటెస్‌ను కోరినప్పుడు పాపం ఆ పిల్ల హృదయం దడ దడ కొట్టుకోసాగింది. కాని నరుమోవ్ ఇంజనీరు కాదనీ, ఆశ్వికదళంలో ఆఫీసరనీ తెలుసుకున్నప్పుడు, చపలచిత్తు డైన టామ్‌స్కీని తను అవివేకంగా ప్రశ్నించి తన రహస్యాన్ని బయట పడేసుకున్నానుకదా అని ఆవిడ విచారించింది.

హెర్మన్ జర్మనీ దేశస్థుడు. కాని అతని తండ్రి రష్యన్ పౌరసత్వం స్వీకరించి వారిలో కలిసిపోయాడు. హెర్మన్‌కు పిత్రార్జితమైన ఆస్తిపాస్తులు అట్టేలేవు. అయినప్పటికీ తన బ్రతుకు తాను బ్రతకాలనే నిశ్చయంతో దానిమీద వచ్చే వడ్డీ డబ్బులుకూడా ఆశించకుండా తన రెక్కల కష్టంతోటే పొట్టపోసుకుంటున్నాడు. వచ్చే జీతపురాళ్ళతోనే తృప్తిపడుతూ అందులోనే అణిగి మణిగి మప్పితంగా జీవిస్తున్నాడు. ఏమైనప్పటికీ అతనికీ ఆశలు, ఆకాంక్షలు ఉన్నాయి. కాని బయటపడడు. నలుగురితోనూ పూసుకుని తిరగడు. అతనంత పొదుపుగా ఉండడంచూచి స్నేహితులంతా పరిహాసం చేస్తుంటారు కూడా. అతనికి చాలా బలీయమైన కోరికలున్నాయి. ఎన్నెన్నో తీవ్రమైన ఊహాలున్నాయి. కాని అతని

స్వభావం చాలా దృఢమైనది. గట్టిమనస్సు. అదే అతన్ని యౌవనంలో ఎలాంటి పొరపాట్లకూ లోను కాకుండా కాపాడుతూ వచ్చింది. అలాగే లోపల జూదమాడాలని పీకుతున్నప్పటికీ అతనెన్నడూ పేకాడి ఎరుగడు. అందుకు తనకు తాహతు లేదనుకునేవాడు. 'లేని దేదో వస్తుందని ఆశించి దానికోసం ఉన్నది పోగొట్టుకోవడం తెలివి తక్కువ' అనేవాడు. అయినప్పటికీ పేకాటసాగుతుంటే రాత్రంతాకూడా ప్రక్కన కూచుని చూస్తూఉంటాడు. ఆటలో ఎప్పటికప్పుడు సాగే ఎత్తులు పైఎత్తులు కని పెడుతూ వెర్రిగా ఉద్రిక్తుడవుతూ, ఆందోళన చెందుతూ కూచుండిపోతాడు.

ఇప్పుడీ పమూడుముక్కల కథ అతని మనస్సులో బలంగా నాటుకునిపోయింది. అతని ఊహలన్నీ ఒక్క మాటుగా ఉప్పొంగాయి. ఆ రాత్రంతాకూడా ఆ కథే అతని మనస్సులో మెదులుతూ ఉంది.

ఆ మరుసటిరోజు రాత్రి పీటర్సుబర్గు వీధుల్లో తిరుగుతూ "ఒకవేళ ఆ వృద్ధ కౌంటెస్ ఆ రహస్యం నాకు చెపితే?" అనుకున్నాడు తనలోతాను. "ఒకవేళ ఆవిడ ఆ మూడుగెలుపు ముక్కలపేర్లూ నాతో చెపితే అప్పుడేమవుతుంది? ఒకమాటు నేను నా అదృష్టంకోసం

ఎందుకు ప్రయత్నించకూడదు? నామటుకు నేనే వెళ్ళి ఆ మెగారి పరిచయం చేసుకుంటే? ఆవిడ ప్రాపకాన్ని, అభిమానాన్ని సంపాదించుకుంటే?– బహుశా ఆవిడ ప్రియుణ్ణే అయితే...కాని దీనికంతటికీ కూడా ఎంతో కాలం పడుతుంది, ఆవిడ ఎనభైఏడేండ్ల వృద్ధురాలు. ఓ వారంరోజుల్లోనే ఆవిడ చనిపోవచ్చు—లేదా రేపో, ఎల్లుండో కన్నుమూయవచ్చు! పోతే ఆ కథ విషయం ఏమిటి?...అది నమ్మదగిన విషయమేనా? అలాకాదు! దేనికైనా ముందు జాగ్రత్త, శాంతం, పరిశ్రమ అవసరం- ఈ మూడే నాకు నమ్మకమైన పేకముక్కలు! ఈమూడు ముక్కలతోనే నా అదృష్టం ఎలా ఉంటుందో ప్రయత్నించి చూస్తాను. వీటితోనే నా అదృష్టం ఇబ్బడి ముబ్బడిగా పెరగవచ్చు. నిర్భయంగాను, స్వతంత్రంగాను బ్రతికే పరిస్థితిని సాధించుకోవచ్చు" అనుకున్నాడు.

ఇలా ఊహించుకుంటూ అతను పీటర్సుబర్గులోని ఒక ప్రధానమైన వీధిలోకి వెళ్ళాడు. పురాతనపు శిల్పపు పనితనంతో కట్టబడిన ఒక భవనంముందుకు వచ్చాడు. వీధంతా బండ్లతో అటకాయించబడి ఉంది. ఒకదాని తరువాత ఒకటి బండ్లు తెరిపిలేకుండా దీపకాంతులతో వెలుగుతున్న భవనం తలవాకిట వసారాముందుకు వెడు

తున్నాయి. నిముషనిముషానికీ బండ్లతలుపులు తెరుచు కుంటున్నాయి. యౌవనంలో ఉన్న ఒక సొగసుకత్తె సుతిమెత్తనిపాదమో లేక గలగలలాడే ఎత్తుబూటో లేక చారలమేజోడో, స్లిప్పరువేసుకున్న రాజకీయవేత్త కాలో బయటికిరావడం కనిపిస్తోంది. వాకిటిదగ్గర శివిగా నిలుచున్న సేవకుడి ప్రక్కనుంచి ఎన్నో టోపీలు, ఉన్ని కోట్లు చూపులను చెదరగొట్టేంత వేగంగా వెళ్ళిపోతు న్నాయి, హెర్మన్ ఆగిపోయాడు.

"ఈ భవనం ఎవరిది?" అని మూలతిరుగుళ్ళో ఉన్న పోలీసును అడిగాడు.

"కౌంటెస్——ది" అని సమాధానం చెప్పాడు పోలీసువాడు.

హెర్మన్ భయకంపితుడైనాడు. ఆ అద్భుతమైన కధ మళ్ళీ అతని కళ్ళముందు పొడగట్టింది అతను ఆ ఇంటిముందు అటూ ఇటూ పచార్లుచేయడం మొదలు పెట్టాడు. ఆ గృహ యజమానురాలి అద్భుత శక్తిని గురించి ఆలోచించసాగాడు. అతను తిరిగి తన ఇంటికి చేరుకునే సరికి చాలా ప్రొద్దు పోయింది. సాధా రణమైన ఇల్లు అతనిది. ఆ ఇంట్లో చాలా రాత్రి వరకూ మెలుకనతో పడుకున్నాడు. చివరకు నిద్రపట్టింది.

ఆ నిద్రలో కలకన్నాడు. పేకముక్కల కల! గొంగళి కప్పిన టేబిల్, దానిమీద కట్టలు కట్టలు నోట్లు, కుప్పలు కుప్పలు బంగారు నాణాలు. పేకాట సాగుతోంది. అతను ఒకదానితరువాత ఒకటి ముక్కలమీద పందెం ఒడ్డి ఆడు తున్నాడు. దిట్టంగా కూచుని పందెం రెట్టింపు చేస్తు న్నాడు. గెల్చుకుంటున్నాడు. కుప్పలు కుప్పలు బంగారు నాణాలు తనదగ్గరికి తీసుకుంటున్నాడు. కట్టలు కట్టలు నోట్లు జేబుల్లో తురుముకుంటున్నాడు.

ఎంతో ఎండపడినతరువాత నిద్రలేచాడు. కలలో కనిపించిన సిరి అంతా నిజంకాకుండాపోయినందుకు నిశ్వ సించాడు. మళ్ళీ బయటికి వెళ్ళి నగరవీధుల్లో తిరగడం మొదలుపెట్టాడు. మరోమాటు కౌంటెస్ భవనంముందుకు వెళ్ళి నిలుచున్నాడు. ఏదో అనూహ్యమైన శక్తి అతన్ని అక్కడికి లాక్కొంచింది. అతను నిశ్చలంగా నిలుచుని కిటికీలవంక చూడసాగాడు. ఒక కిటికీ ప్రక్కన ఒక నల్లటి తల క్రిందికి వాల్చుకుని పుస్తకం చదువుకుంటున్నట్లు గానో లేక పనిచేసుకుంటున్నట్లుగానో కనిపించింది. తరు వాత ఆ వంచిన తల పైకెత్తింది. హెర్మన్‌కు ఒక అంద మైన ముఖం, నల్లని కళ్ళు కనిపించాయి. ఈక్షణమే ఆతన అదృష్టాన్ని నిర్ణయించింది.

# 3

లిసవెటా ఇవనోవ్నా తనపై ఉడుపు, హేటు తీసివేసిందో లేదో అంతలోనే కౌంటెస్ ఆ అమ్మాయి కోసం కబురు పంపింది. మళ్ళీ బండి పిలిపించవలసిందని ఉత్తర్వు చేసింది. ఇంకేం? ఆ ప్రకారం వారు బండి ఎక్కడానికి బయటికి వెళ్ళారు. ఇద్దరు సేవకులు ఆ వృద్ధురాలిని పైకెత్తి బండ్లో ఎక్కించారు. లోపలికి నెట్టి కూచోబెట్టారు. ఆ తరుణంలో యువకుడైన ఆ ఇంజనీరు బండిచక్రాల ప్రక్కనే నిలుచుని ఉండడం లిసవెటా ఇవనోవ్నా చూచింది. అతను ఆ పిల్ల చెయ్యి పట్టుకున్నాడు. ఆ అమ్మాయికి భయంతో స్పృహ తప్పినంత పని అయింది. ఆ యువకుడు అదృశ్యమైపోయాడు. ఆవిడ చేతిలో ఒక ఉత్తరంమాత్రం ఉండిపోయింది. తరువాత ఆవిడ దాన్ని తన చేతి తొడుగులో కనిపించకుండా దాచుకుంది. బండ్లో వెడుతున్నంతసేపూ ఆ పిల్లకూ ఏదీ

కనిపించడంలేదు, ఏదీ వినిపించడంలేదు. ఇహ కౌంటెస్ విషయం చూడబోతే బండ్లో ఉన్నంతసేపూ ఏదో ఒకటి ప్రశ్న తరువాత ప్రశ్న అడుగుతుండడమే ఆవిడపని. అది ఆవిడ అలవాటు - ఆ వెళ్ళేదెవరు? అది ఏ వంతెన? ఆ బోర్డుమీద ఏం వ్రాసి ఉంది?...ఇదీ వరస! ఈ మాటు లిసవెటా ఇవనోవ్నా అనాలోచితంగా సమాధానాలివ్వడం మొదలుపెట్టింది. అర్థంలేని ఆవిడ జవాబులు వినేసరికి కౌంటెస్‌కు కోపం వచ్చింది.

"నీకేం మునించిందే అమ్మాయీ? హఠాత్తుగా నీకేమైన తల తిరిగిపోయిందా ఏమిటి? నే అడిగేది నీకు వినిపించడంలేదా లేక అర్థంమేకావడం లేదా?... దేవుడి దయవల్ల నాకింకా అవకతవకమాటలు రావడంలేదు, ఇంత వృద్ధురాలనైనప్పటికీ నాబుద్ధి బుగ్గిపోకుండా ఉందిలే!" అన్నది కౌంటెస్.

నిజానికి లిసవెటా ఇవనోవ్నా ఆవిడ చెప్పేదేమీ వినడంలేదు. ఇంటికి తిరిగిరాగానే ఆ అమ్మాయి గబగబ తన గదిలోకి వెళ్ళిపోయింది. తన చేతితొడుగులోనుంచిఆ ఉత్తరం బయటికి తీసింది - ఆ ఉత్తరం అంటించిలేదు. గబగబ ఉత్తరమంతా చదివింది. అదొక ప్రేమలేఖ. ఎంతో మృదువుగాను, మర్యాదగాను వ్రాసిన ప్రేమలేఖ.

అందులో ప్రతి అక్షరం ఒక జర్మన్ నవలలోనుంచి చూచి వ్రాసిందే. కాని లిసవెటా ఇవనోవ్నాకు జర్మన్ భాష తెలియదు. అంచాత అతను స్వతహాగానే వ్రాశాడనుకుంది. ఆ ఉత్తరం చదువుకుని ఎంతో ముగ్ధురాలై పోయింది.

అయినప్పటికీ ఆ ఉత్తరం ఆ అమ్మాయిని అమితంగా కలవర పెట్టసాగింది. ఒక యువకుడితో రహస్యంగా స్నేహ సంబంధం పెట్టుకోవడం ఆ అమ్మాయి జీవితంలో ఇదే మొదటిసారి. అతని సాహసం ఆ పిల్లను భయపెట్టింది. ఇంత తెలివితక్కువగా ప్రవర్తించినందుకు తన్ను తాను నిందించుకుంది. కాని ఏం చేయడానికి పాలుపోయిందికాదు. ఇహమీదట తను ఆ కిటికీప్రక్కన కూచోవడం మానేస్తే? ఆ విధంగా తన అసమ్మతిని తెలియపరిచి ఇహమీదట ఆ యువకుడు తనను వెంటాడకుండా చేసుకుంటే? ఈ ఉత్తరం అతనికి తిరిగి పంపెయ్యాలా లేక చీవాట్లుపెట్టి తన నిశ్చయాన్ని తెలుపుతూ జవాబు వ్రాయాలా? సలహా అడగడానికి ఆ పిల్లకెవరూ లేరు - స్నేహితురాండ్రూ లేరు, బోధచేసేవారు లేరు. చివరకావిడ జవాబువ్రాయడానికి నిశ్చయించుకుంది

కాగితం, కలం తీసుకుని తన చిన్న వ్రాతబల్లముందు కూచుంది. ఆలోచించింది అనేకసార్లు. ఉత్తరం మొదలు పెట్టింది-ప్రతిసారీ చింపి వేసింది. తనుఉపయోగించేమాటలు అతనికి ఎక్కువగా చనువుఇచ్చి, తను లోబడుతున్నట్లుగా నైనా ధ్వనిస్తున్నాయి. అది గమనించే లేదా చాలా తీవ్రంగానైనా వుంటున్నాయి. ఆవిడ ప్రతిసారీ వ్రాసింది చింపివేస్తూవచ్చింది. చివర కెలాగైతేనేం కొద్దిపంక్తులు వ్రాసింది. ఈమాటలు ఆవిడకు సంతృప్తి కలిగించింది.

ఆవిడ వ్రాసిన జాబు ఇది: "మీఉద్దేశ్యాలు గౌరవనీయమైనవనీ, మీరు అనాలోచితమైన పనిచేసి నన్ను అవమానించ దలచుకోలేదనీ నేను విశ్వసిస్తున్నాను. కాని మన పరిచయం ఈపద్ధతిలో మొదలుకాకూడదు. మీజాబు ఇందుతో తిరిగి పంపుతున్నాను. ఇకముందు నేను అయోగ్యమైన, అమర్యాదమైన విషయం జరిగిందని ఫిర్యాదు చేయడానికి కారణం కల్పించరని ఆశిస్తున్నాను."

ఆ మరుసటిరోజు లిసవెటా ఇవనోవ్నా మామూలుగా కిటికీదగ్గర కూచుని కుట్టుపని చేసుకుంటోంది. హెర్మన్ రావడం చూడగానే ఆవిడ అక్కడనుంచి లేచి ప్రక్క గదిలోకి వెళ్ళింది. కిటికీతలుపుతీసి అందులోనుంచి ఆఉత్తరం అవతలికి విసిరేసింది. ఆయువకుడు నేర్పుగా దాన్ని

అందుకోగలడని నమ్మకంతోనే అలాచేసింది. హెర్మన్ ఉత్తరం పడినచోటుకు పరుగెత్తాడు. ఉత్తరం అందుకుని గబగబ ఒకపిండివంటలమ్మే దుకాణంలో ప్రవేశించాడు. ఉత్తరం చింపిచూచాడు. అందులోతను వ్రాసిన ఉత్తరం, లిసవెటా ఇవనోవ్నా వ్రాసిన జవాబు అతనికి కనిపించాయి. అతననుకున్నట్లే జరిగింది. కనుక తను పన్నిన కుతంత్రం సఫలమైనదని సంతోషిస్తూ ఇంటికి వెళ్ళాడు.

ఇది జరిగిన మూడు రోజులకు స్త్రీల టోపీలు అమ్మే దుకాణంలో పనిచేసే ఒక చక్కని అమ్మాయి లిసవెటా ఇవనోవ్నాకు ఒక ఉత్తరం పట్టుకొచ్చి ఇచ్చింది.

లిసవెటా ఇవనోవ్నా ఆతృతతో ఆ ఉత్తరం విప్పి తీసిచూచింది. అదేదో బాకీతాలూకు సొమ్ము ఇమ్మని వ్రాసిన చీటీ ఏమోనని భయపడింది. కాని తీరా చూచే సరికి అకస్మాత్తుగా అది హెర్మన్ దస్తూరి అని ఆవిడ గుర్తుపట్టింది.

"అమ్మాయీ! నీవుపొరపాటుపడ్డావమ్మా! ఈ ఉత్తరం నాకు కాదు" అన్నది.

"అది మీకే, నిశ్చయంగా మీకిమ్మని ఇచ్చిన ఉత్తరమే!" అని జవాబు చెప్పింది ధైర్యంగా ఆ దుకాణంలో పిల్ల. ఇలా చెపుతూ కుత్సితంగా చిరునవ్వు నవ్వింది. "దయచేసి చదవండమ్మా" అన్నది.

లిసవెటా ఇవనోవ్నా గబగబ ఉత్తరమంతా పారచూచింది. ఒకమాటు కలుసుకునే ఏర్పాటు చేయవలసిందని కోరాడు హెర్మన్.

"అమ్మాయీ! నీవు పొరపాటుపడ్డావు" అన్నదావిడ. లిసవెటా ఇవనోవ్నా అతనంతత్వరగా కలుసుకోమని కోరినందుకు, ఈ విధంగా ఉత్తరం అందజేసినందుకు భయపడిపోయింది. "ఈ ఉత్తరం బహుశా నాకు వ్రాసిందికాదు" అంటూ ఉత్తరం చింపి ముక్కలు ముక్కలు చేసి పారేసింది.

"మీకు వ్రాసిందికాకపోతే దాన్నెందుకు చింపి పారేశారు?" అని అడిగింది ఆ అంగడిపిల్ల. "లేకపోతే దాన్ని ఎవరు పంపారో మళ్ళీ వారికే అందచేసేదాన్నే" అన్నది.

"అమ్మాయీ! ఇహముందెప్పుడూ నాకు ఉత్తరాలు పట్టుకరాకు" అన్నది లిసవెటా ఇవనోవ్నా, ఆపిల్ల మాటకు ముఖమంతా ఎర్రచేసుకుంటూ "ఈ ఉత్తరం

పంపిన ఆయనతో చెప్పు, ఇలాటిపని చేసినందుకు సిగ్గు పడాలని చెప్పు!..." అన్నది.

కాని హెర్మన్ తన ప్రయత్నం మానుకోలేదు. లిసవెటా ఇవనోవ్నాకు ప్రతిరోజూ అతనిదగ్గరనుంచి అనేక మార్గాలద్వారా ఉత్తరాలు వస్తున్నాయి. ఇహ ఇప్పుడవి జర్మన్‌భాషలోనుంచి అనువదించి వ్రాస్తున్నవి కావు. హెర్మన్ మోహావేశంలో మునిగిపోయి వ్రాస్తున్న జాబులవి. తన సహజమైన శైలిని ఉపయోగించి వ్రాస్తున్నాడు. అతని స్థిరమైన వాంఛలు, విచలితమైన మనస్సులో పట్టపగ్గాలు లేకుండాకూడా పరుగులుతీస్తున్న భావపరంపరలు; ఇవి రెండూకూడా వాటిల్లో ప్రస్ఫుటంగా ప్రతిబింబిస్తున్నాయి. ఇహ ఇప్పుడు లిసవెటా ఇవనోవ్నా వాటిని అతనికి తిప్పి పంపించే ప్రయత్నాలుకూడా చేయడంలేదు. ఆ అమ్మాయి వాటి మైకంలో తేలిపోతోంది. వాటికి సమాధానాలు వ్రాసి పంపుతోంది. ఆవిడ వ్రాసే ఉత్తరాలుకూడా రానురాను రసవత్తరంగాను, దీర్ఘమైనవిగాను తయారయినాయి. చివరకావిడ ఈ క్రింది ఉత్తరం వ్రాసి కిటికీలోనుంచి అతనికి విసిరేసింది.

"ఈరాత్రికి ఎ - రాయబారకార్యాలయంలో నృత్యం జరగబోతోంది. కౌంటెస్ అక్కడికి వెళ్ళనున్నది.

మేమక్కడ రెండుగంటలదాకా ఉంటాం. నన్ను మీరు ఒంటరిగా చూడడానికి తగిన అవకాశం ఇదే. కౌంటెస్ ఎప్పుడైతే వెడుతుందో ఆవిడ సేవకులుకూడా అప్పుడే తప్పక వెళ్ళిపోతారు. ఇహ తల వాకిట వసారాలో కాపలావాడుమాత్రం ఉంటాడు. మామూలుగా అతను కూడా తన చిన్నగదిలోకి వెళ్ళిపోతాడు. కనుక మీరు పదకొండున్నర గంటలకు రండి. నేరుగా పై అంతస్థులోకి వెళ్ళండి. అక్కడ హాల్లో మీకెవరైన కనిపించినట్లయితే కౌంటెస్‌నుగురించి వారినడగండి. ఆవిడగారు ఇంటిదగ్గర లేరని వారు మీకు సమాధానం చెపుతారు. ఇహమీరు చేసేదేమీ ఉండదు. కనుక వెళ్ళండి. కాని బహుశా మిమ్మల్నెవరూ కలుసుకోవడం తటస్థించదు. పరిచారకు లందరూ కలిసి తమ స్వంతగదిలో ఉంటారు. హాలు దగ్గరనుంచి మీరు ఎడమవైపుకి తిరగండి. అలా తిరిగి సరాసరి వెడితే చివరకు మీకు కౌంటెస్ పడకగది తగులుతుంది. అక్కడ మీకు ఒక తెరవెనకాల రెండు చిన్న వాకిళ్ళు కనిపిస్తాయి. కుడివైపున ఉన్న వాకిలి చదువుకునేగదికి దోవతీస్తుంది. కౌంటెస్ ఎప్పుడూ అందు లోకి వెళ్ళదు. ఇహ ఎడమప్రక్కవాకిలి ఒక నడవలోకి దోవతీస్తుంది. అక్కడ చుట్టుచుట్లుగా ఉన్న సన్నని

మెట్లవరుస ఒకటి కనిపిస్తుంది. ఆ మెట్లెక్కివస్తే నా గది లోకి చేరుకుంటారు."

అడవిమృగం తనకు ఆహారం దొరికిందని తెలిసిన తరువాత ఎప్పుడెప్పుడు దానిమీదపడి తినేద్దామా అని కాచుకకూచుంటుందో హెర్మన్ ఆ సమయంకోసం అలా కసిపెట్టుక కూచున్నాడు. రాత్రి పదిగంటలయ్యే సరికల్లానే కౌంటెస్ భవనంముందు కాపలా వేశాడు. వాతావరణం భయంకరంగా ఉంది. చలిగాలి భోరున వీస్తోంది. మంచు పెచ్చులు పెచ్చులుగా పైనుంచి పడు తోంది. వీధిలాంతర్లు ఉంటవా పోతవా అన్నట్లు గ్రుడ్డిగా వెలుగుతున్నాయి. వీధుల్లో పుట్టపురుగులేదు. అప్పు డప్పుడు ఎవడో ఒక బాడుగబండివాడు తన బక్కచిక్కి ఉసూరుమంటున్న గుర్రాన్ని తోలుకుంటూ దిగబడి పోయిన బాటసారి ఎవడైనా కనిపిస్తే బాడుగ దొరుకు తుందేమో అని తారట్లాడుతున్నాడు. హెర్మన్ అక్కడ అలాగే నిల్చునిఉన్నాడు. వంటిమీద తేలిగ్గాఉన్న లోపలి ఉడుపుతప్ప మరి పైన ఏమీలేదు. అయినా ఆ ఈదురు గాలికాని మంచుకాని అతనివంటికి తాకుతున్నట్లే అని పించడంలేదు. చివరకెలాగైతేనేం కౌంటెస్ వెళ్ళే బండి వచ్చి భవనంముందు ఆగింది. సేవకులు బయటికి రావడం

హెర్మన్ చూచాడు. కౌంటెస్‌ను అటొకరూ ఇటొకరూ భుజాలమీద వేసుకొని మోసుకొస్తున్నారు. వంగి ముడుచుక పోయినట్లు కనిపిస్తున్న ఆ వృద్ధురాలు వంటిమీద నల్లని పైదుస్తుధరించింది. ఆవిడ వెనకాలే ఆవిడ చెలికత్తె అయిన ఆ అమ్మాయికూడా వచ్చింది. పల్చని వలపంలాంటి ఉడుపు పైనకప్పుకుంది. తల్లో చక్కని పూలు పెట్టుకుంది. బండి తలుపులు మూసుకున్నాయి. బండి బరువుగా, పొడిపొడి అయిన మంచుమీదిగుండా సాగిపోయింది. కావలావాడు వీధివాకిలి మూసివేశాడు. కిటికీలు చీకటయినాయి. హెర్మన్ నిర్మానుష్యంగా ఉన్న ఆ భవనంముందు పైకీ క్రిందికీ పచారుచేయ సాగాడు. ఒక వీధిలాంతరు దగ్గరికి వచ్చి గడియారం చూచుకున్నాడు—అప్పటికి పదకొండుగంటల ఇరవై నిముషాలయింది. అతను ఆ దీపం వెలుతురులోనే నిలవబడి ఉన్నాడు. మిగతా ఆ పదినిముషాలు ఎప్పుడు పూర్తవుతుందా అని గడియారం ముల్లువంక దృష్టినిలిపి చూడడం మొదలుపెట్టాడు. సరిగ్గా పదకొండున్నర కాగానే కౌంటెస్ భవనం తలవాకిట వసారాలోకి వెళ్లాడు. ద్వారంకడ చక్కగా దీపం వెలుగుతోంది. కావలావాడు మాత్రం అక్కడ కనిపించలేదు. హెర్మన్ గబగబ భవ

నంపై అంతస్తులోకి పరుగెత్తాడు. హాలు వాకిలి తెరి చాడు. అక్కడొక సేవకుడు దీపకాంతిలో పాతపడి మకిల పట్టిఉన్న పడకకుర్చీలో పడుకుని నిద్రపోతున్నాడు. హెర్మన్ మెల్లగా తొట్రుపడకుండా అడుగులు వేస్తూ అతన్ని దాటేసివెళ్ళాడు. బాల్‌రూము, డ్రాయింగ్ రూము చీకటిగా ఉన్నాయి. హాల్లో ఉన్న దీపం ఆ గదు ల్లోకి గుడ్డివెలుతురు చిమ్ముతోంది. హెర్మన్ పడగ గదిలో ప్రవేశించాడు. అక్కడ పురాతన ప్రతిమలు చెక్కబడిఉన్న ఒకకొయ్య భోషాణంఉంది. దానిముందర కడ బంగారుపూత వేసిన ఒకలాంతరు వ్రేలాడదీయబడి ఉంది. చేతులకుర్చీలు, సోఫాలు, చాలమటుకు వాటికి వేసిన గిల్టుపోయి, కాంతి తరగిపోయిన పట్టుజలతారుతో కనిపిస్తున్నాయి. సోఫాల్లోను, కుర్చీల్లోను కూచుంటే మెత్తలు, ఆనుదుదిండ్లు మరకలు, మాసికలుపడి జోలె సంచుల్లా జారినట్లు కనిపిస్తున్నాయి. గోడలకు చీనా కాగితం అంటించబడి ఉంది. గదిలో అన్ని వస్తువులు దీనంగా, దిగులుగా కనిపిస్తున్నాయి. పారిస్‌లో ప్రసిద్ధ చిత్రకారిణి మదాం లెబ్రన్ వ్రాసిన రెండు చిత్తరువులు గోడలకు వ్రేలాడుతున్నాయి. అందులో ఒకటి నలభై సంవత్సరాల వయస్సులో ఉన్న పురుషుడి చిత్తరువు.

ఎర్రగా, బొద్దుగా ఉన్నాడు. ఆకుపచ్చ యూనిఫారం వేసుకుని వక్షస్థలంమీద నక్షత్రపు గుర్తు ధరించాడు. రెండవది ఒక స్త్రీ చిత్తరువు. యౌవనంలో ఉన్న సొగసు కత్తె. గరుత్మంతుడిముక్కు. తలలో ఒక గులాబీపువ్వు పెట్టుకుంది. జుట్టు చెంపలదాకా వంకులొంకులు తిరిగి ఉంది. గదిలో ప్రతిమూలలోను, ప్రతి సందులోను పింగాణీతో చేసిన గొల్లవాండ్లు, గొల్లస్త్రీలబొమ్మలు కనిపిస్తున్నాయి. వెరోయ్ నేర్పుతో తయారుచేసిన గడి యారాలు, చిన్నచిన్న పెట్టెలు, పైమూతలు, విసన కర్రలు, స్త్రీల వినోదార్థం తయారుచేయబడిన క్రిందటి శతాబ్దం తాలూకు రకరకాల చక్కని ఆటవస్తువులు ఉన్నాయి. వాటిలో మాంట్ గోల్ఫియర్ గాలి గుమ్మటం, మెస్మర్ యొక్క అయస్కాంతంకూడా ఉన్నాయి.

హెర్మన్ తెరవెనకాలకువెళ్ళి చూచాడు. అక్క డొక చిన్న ఇనపమంచం కనిపించింది. కుడివైపున చదువు కునే గదులోకి వెళ్ళే వాకిలి ఉంది. ఎడమవైపున నడవ లోకి వెళ్ళే వాకిలి ఉంది. హెర్మన్ ఆ వాకిలి తెరిచాడు. పేదరాలైన ఆ అమ్మాయి వెళ్ళే సన్నని మెట్లువరస

కనిపించింది. కాని అతను మళ్ళీ వెనక్కి తిరిగి చదువు కునే గదిలోకి వెళ్ళాడు.

గంటలు బరువుగా గడిచిపోయాయి. అంతా నిశ్శబ్దంగా ఉంది. డ్రాయింగ్ రూమ్‌లో ఉన్న గోడగడియారం పన్నెండు గంటలు కొట్టింది. తక్కిన అన్ని గదుల్లో ఉన్న గడియారాలుకూడా ఒకదానివెంట ఒకటి పన్నెండు గంటలుకొట్టాయి. మళ్ళీ అంతటా నిశ్శబ్దం ఆవరించింది. హెర్మన్ చల్లగా ఉన్న స్టౌవును ఆనుకుని నిలబడి ఉన్నాడు. అతను కాలుకదపకుండా నిశ్శబ్దంగా ఉన్నాడు. ఒకపని చేయడానికి నిశ్చయించుకున్నప్పుడు, అది ప్రమాదకరమైనదయినా అనివార్యమని తెలుసుకున్నప్పుడు, ఒకడి హృదయం ఎలా నిబ్బరంగా ఉంటుందో హెర్మన్ హృదయం అలా నిబ్బరంగా కొట్టుకుంటోంది. గడియారాలు ఒంటిగంటకొట్టాయి. తరువాత రెండు-అతనికి దూరంనుంచి బండిగానుగ చప్పుడు వినిపించింది. అతను ఆపుకోలేని ఉద్వేగంతో కలవరపడడం మొదలుపెట్టాడు. బండివచ్చి వచ్చి ఆగింది. బండ్లోనుంచి మనుష్యులు దిగుతున్న చప్పుడు వినిపించింది. ఒక్కమాటు ఇల్లంతటా గడబిడ బయలుదేరింది. మనుష్యులు పరుగెత్తుతున్నారు. మాటలు వినిపిస్తున్నాయి ఒక్క

మాటుగా దీపాలన్నీ వెలిగాయి. వయస్సుమళ్ళిన ముగ్గురు పరిచారకులు పడకగదిలోకి పరుగెత్తారు. కౌంటెస్ ప్రాణాలున్నాయా పోయాయా అన్నట్లు నిర్జీవంగా కనిపిస్తోంది. పడకగదిలోకివచ్చి చేతులున్నకుర్చీలో వాలిపోయింది. హెర్మన్ తలుపు రంధ్రంలోనుంచి తొంగిచూచాడు. లిసవెటా ఇవనోవ్నా అతని ప్రక్కనుంచే వెళ్ళింది. ఆవిడ గబగబా మెట్లెక్కి తన గదిలోకి వెళుతూ ఉండడం అతనికి వినిపించింది. హఠాత్తుగా అతని హృదయంలో శూల నొప్పిలాంటి పశ్చాత్తాపం పుట్టుకొచ్చింది. కాని మళ్ళీ వెంటనే చల్లారిపోయింది. అతను శిలాప్రతిమలా నిలుచుండిపోయాడు.

కౌంటెస్ అద్దంముందు తన ముస్తాబు తీసివేసుకోవడం మొదలు పెట్టింది. గులాబీలు పొంకంగా కూర్చిపెట్టిన ఆవిడ టోపీ పిన్నులు పరిచారకులు ఊడతీశారు. తలమీద పౌడరద్దిన విగ్గు తీసివేశారు. తెల్లగా నెరిసిన ఆవిడతల అంటకత్తిరించి ఉంది. వెండి జరీఅంచులతో ఉన్న ఆవిడ పసుపుపచ్చని ఉడుపు ఉబ్బివున్న ఆవిడ పాదాలముందు పడింది. ఆవిడ భయంకరమైన ముస్తాబుల, అలంకారాల మర్మాలన్నిటినీ హెర్మన్ కళ్ళారా చూచినవాడైనాడు. చివరకావిడ రాత్రి తొడుక్కునే గౌను

తొడుక్కొని, రాత్రి పెట్టుకునే టోపీ పెట్టుకొని ఉండి పోయింది. ఆ వృద్ధాప్యంలో ఉన్న ఆవిడకు ఆ దుస్తులే ఎంతో తగినట్లున్నాయి. ఇప్పుడావిడ అంత భయంకరం గాను, లజ్జాకరంగాను కనిపించడంలేదు.

వృద్ధు లందరికిమల్లేనే కౌంటెస్ కూడా నిద్రలేమితో బాధపడుతోంది. పరిచారకలు తన ముస్తాబు తీసివేసిన తరువాత ఆవిడ కిటికీప్రక్కన ఎత్తుగా ఆనుకున్న చేతుల కుర్చీలో కూచుని వాళ్ళను అవతలికి పంపించివేసింది. దీపాలుకూడా అవతలికి పట్టుకెళ్ళారు. మళ్ళీ ఇప్పుడు గదిలో బంగారు పూత వేసిన ఆ ఒక్క లాంతరుమాత్రమే వెలుగుతోంది. పచ్చగా పసిరిక కక్కుతున్నట్లున్నది కౌంటెస్ ముఖం. పెదవులు అటూ ఇటూ కదిలిస్తూ ఉంది. కుర్చీలో ఆవిడ శరీరం ఆ ప్రక్కకూ ఈ ప్రక్కకూ ఊగుతోంది. ఆవిడకళ్ళల్లో కాంతిలేదు. ఏదో మతిమరుపు చెంది మనలోకంలో లేనట్లు కనిపిస్తుంది. భయంకరంగా ఉన్న ఆ వృద్ధురాలు అలా కుర్చీలో అటూ ఇటూ ఊగుతూ ఉండడం చూస్తే ఎవరైనా, ఆ కదిలేది ఆవిడ కాదనీ, ఏదో నిగూఢమైన విద్యుచ్ఛక్తి తన ప్రభావంతో ఆవిడనలా కదిలిస్తోందనీ అనుకుంటారు.

ప్రేతకళ పడి ఉన్న ఆవిడ ముఖంలో హఠాత్తుగా చెప్ప నలవికాని మార్పు వచ్చింది. ఆవిడ పెదవులు కదలడం మానివేశాయి. కళ్ళలోకి వెలుగు వచ్చింది. ఒక కొత్త వ్యక్తి కొంటెస్ ముందు నిలబడ్డాడు.

"భయపడకమ్మా! మీకు పుణ్యముంటుంది భయ పడకమ్మా!" అంటున్నాడతను నిమ్మళంగాను, స్పష్టం గాను. "నేను మీకు అపాయం కలిగించాలని రాలేదు- మీనుంచి ఒక్క సహాయం అర్థించడానికి వచ్చాను" అంటున్నాడు.

ఆ వృద్ధురాలు మౌనంతో అతనివంక తదేకంగా చూచింది. కాని అతనిమాటలు విన్నట్లు కనిపించడం లేదు. ఆవిడకు చెవుడేమో అనుకున్నాడు హెర్మన్. ఆవిడమీదికి వంగి ఆవిడ చెవిలో మళ్ళీ అవేమాటలు చెప్పాడు. అయినా ఆ వృద్ధురాలు మునుపటిలాగే మౌనంగా ఉండిపోయింది.

"మీరు నాజీవితాన్ని సుఖవంతం చేయగలరు" అంటూ చెప్పసాగాడు హెర్మన్. "దానివల్ల మీకేమీ ఖర్చుకాదు. మీరు పేకాటలో వరుసగా మూడు గెలుపు ముక్కలు కనుక్కోగలరన్న విషయం నాకు తెలుసు..." అన్నాడు.

ఇలా అని హెర్మన్ ఆగాడు. తననుంచి అతనేం కోరుతున్నదీ కౌంటెస్ స్పష్టంగా అర్థం చేసుకున్నది. అతనికి సమాధానం చెప్పాలని మాటలకోసం తడుము కుంటున్నదికూడా.

చివరకావిడ "అది కేవలం పరాచకం. నీకు ప్రమాణంచేసి చెపుతున్నాను! అది కేవలం తమాషా కన్నమాట!" అని జవాబు చెప్పింది.

ఇది తమాషావిషయం కాదు" అన్నాడు మళ్ళీ హెర్మన్ కొంచెం కోపంగా. "మీరు గుర్తు తెచ్చు కోండి. మీరు చాప్లిటిస్కీకి సహాయంచేశారు. అతను పోగొట్టుకున్న డబ్బంతా మళ్లీ గెలుచుకున్నాడు" అన్నాడు.

ఇప్పుడు కౌంటెస్ నిజంగానే కలవరపడింది. ఏదో తీవ్రమైన ఉద్వేగం ఆవహించినట్లు ఆవిడ ముఖ కవళికలను బట్టి స్పష్టమవుతోంది. కాని మళ్లీ అంతలోనే ఆవిడ వెనకటిలాగా ఉదాసీనత వహించింది.

"ఆ మూడు గెలుపుముక్కల పేర్లేమిటో నాకు చెప్పగలరా?" అని మళ్ళీ అడిగాడు హెర్మన్.

కౌంటెస్ మౌనందాల్చింది. హెర్మన్ తిరిగి చెప్పడం మొదలుపెట్టాడు:

"ఎవరికోసం మీరీ మర్మాన్ని జాగ్రత్తగా దాచి పెడుతున్నారు? మీ మనమలు, మనమరాండ్రకోసమా? వారెప్పటికీ- ఈమర్మం చెప్పకపోయినప్పటికీ భాగ్యవంతులే. డబ్బువిలువ వాళ్ళు ఎన్నటికీ తెలుసుకోలేరు. పోతే అనవసరంగా, దుబారాచేసేవాడికి మీ మూడు ముక్కలూ ఉపయోగపడవు. ఎవడైతే పిత్రార్జితమైన ఆస్తిని కాపాడుకోక జారవిడుచుకుంటాడో వాడు చివరకు బికారిఅయి దరిద్రపుచావు చస్తాడు. దేవతలంతా కలిసి కట్టుగావచ్చి నిలబడినా వాణ్ణి రక్షించలేరు. నేను దుబారాచేసే మనిషినికాను. నాకు డబ్బువిలువ తెలుసును. మీ మూడుముక్కల మర్మం నాకు చెప్పినందువల్ల వృథాకాదు. సరేనా?..."

అతను చెప్పడం ఆపి ఆవిడ సమాధానంకోసం ఆతృతతో ఎదురుచూచాడు. కాని కౌంటెస్ మాట్లాడలేదు. అప్పుడు హెర్మన్ ఆవిడముందు మోకాళ్ళాని ప్రార్థించడం మొదలుపెట్టాడు:

"మీ హృదయం ఎప్పుడైనా ప్రేమోద్వేగాన్ని ఎరిగి ఉన్నట్లయితే, ఆ పరవశతలు మీకు జ్ఞాపకం

ఉన్నట్లయితే, అప్పుడే జన్మించిన పిల్లవాడి కేకవిని మీరు ఒక్క-మాటైనా చిరునవ్వునవ్వి ఉన్నట్లయితే, ఏదైనా మానవత్వం మీ గుండెల్లో కొట్టుమిట్టాడినట్లయితే నేను మిమ్మల్ని భార్యగా, ప్రియురాలిగా, తల్లిగా – జీవితంలో పవిత్రమైనవాటన్నిటిగానూ భావించుకుంటూ ప్రార్థిస్తున్నాను! నా విజ్ఞప్తిని త్రోసిపుచ్చకండి ! మీకు తెల్సినతి రహస్యం నాకు చెప్పండి ! అది మీ కేవిధంగా ఉపపడుతుంది ? బహూశా అదిఒక భయంకరమైన పాపంతో ముడిపెట్టుకుని ఉందా ? శాశ్వతమైన బ్రహ్మానందాన్ని నాశనంచేసి ఉందా ? దయ్యంతో ఒప్పందం చేసుకుని ఉందా ? మీరే ఆలోచించండి. మీకు వృద్ధాప్యం వచ్చింది. ఇహ ఎంతో కాలం జీవించరు మీ పాపాలన్ని పైన వేసుకోడానికి నేను సిద్ధంగా ఉన్నాను. మీరు ఆ మర్మంమాత్రం నాకు చెప్పండి. ఒకమానవుడిసౌఖ్యం మీ చేతుల్లో ఉన్నదన్న విషయం విచారించండి. న నొక్కణ్ణిమాత్రమే కాదు - నా పిల్లలు, నా మనమలు, మునిమనములు ఇలా నాలుగు తరాలవరకూకూడా మిమ్మల్ని ఎల్లప్పుడూ స్మరించికుంటూ ఉంటారు. మిమ్మల్ని దేవతలుగా కొలుచుకుంటూ ఉంటారు..."

ఆ వృద్ధురాలు ఒక్క మాటకూడా సమాధానం చెప్పలేదు.

హెర్మన్ లేచి నిలుచున్నాడు.

"ముసలి మంత్రకత్తె!" అన్నాడతను పళ్ళు కొరుకుతూ. "అయితే చూడు! నిన్ను సమాధానం చెప్పే టట్లు చేస్తాను!" అన్నాడు.

ఇలా అంటూ జేబులోనుంచి ఒక పిస్టల్ తీశాడు.

పిస్టల్‌ను చూడగానే కౌంటెస్ మళ్ళీ రెండో మాటు తీవ్రమైన ఉద్వేగానికి లోనయింది. గభాలున తల వెనక్కు విసురుకుంది. దెబ్బ తప్పించుకోవాలన్న ట్లుగా చెయ్యి పైకెత్తింది ... తరువాత కుర్చీమీద వెనక్కు పడిపోయింది... ఆ తరువాత కదల్లేదు మెదల్లేదు.

"చెప్పు? పిల్లతనపు చేష్టలు చెయ్యకు!"అన్నాడు హెర్మన్ ఆవిడచెయ్యి పట్టుకుంటూ.

"చివరసారి అడుగుతున్నాను- ఆ మూడు పేక ముక్కలేమిటో చెపుతావా? చెపుతావా? చెప్పవా?" అని అడిగాడు.

కౌంటెస్ సమాధానం చెప్పలేదు. ఆవిడ చని పోయిఉండడం హెర్మన్ చూచాడు.

# 4

లిసవెటా ఇవనోవ్నా నృత్యానికి వెడుతూ వేసుకున్న దుస్తులు విడువకుండా ఇంకా అలాగే తనగదిలో కూచుని ఉంది. ఏదో అంతులేని ఆలోచనలో మునిగిపోయిఉంది: ఆవిడ నృత్యంనుంచి ఇంటికితిరిగిరాగానే దుస్తులు మార్చడానికై ఆవిడ పరిచారికవచ్చింది. కాని ఆ పరిచారిక నిద్రమత్తుగా ఉండి పనిచేయడానికి బద్ధకించినట్లు కనిపించింది. అంచాత ఆవిడ తనే స్వయంగా దుస్తులుమార్చుకుంటానని చెప్పి పరిచారికను పంపించివేసింది. తరువాత తన గదిలోకి వెళ్ళింది. అక్కడ హెర్మన్ కనిపెట్టుకుని ఉంటాడేమో అని కలవరపడింది. అతనక్కడ లేకుండా ఉంటే బాగుంటుందనికూడా అనుకున్నది. గదంతా ఒక మాటు కలయచూచింది. అతనక్కడ కనిపించకపోయే సరికి అతను రావడానికి ఏదో ఆటకం కలిగి ఉంటుందని అనుకుంది. అలా జరిగినందుకు తన అదృష్టం బాగున్నదని

సంతోషించిందికూడా. దుస్తులు విడవకుండానే కూచుంది. ఇంత కొద్దికాలంలోనే తనను ఇంతదూరం లాక్కొని పోయిన పరిస్థితులనుగురించి మననం చేసుకోవడం మొదలు పెట్టింది. తన కిటికీదగ్గర తొలిసారిగా ఆ యువకుణ్ణిచూచి ఇప్పటికి నిండా మూడువారాలైనా కాలేదు-ఈ కొద్ది వ్యవధిలోనే తను అతనితో ఉత్తర ప్రత్యుత్తరాలు నడి పింది. చివరకతన్ని అర్ధరాత్రివేళ కలుసుకోడానికి అనుమ తించింది. అతని పేరు ఆవిడకు తెలిసిందీ అంటే అందుకుకా రణం అతను వ్రాసినకొన్ని ఉత్తరాల్లో సంతకంచేయడమే. అంతకు తప్పిస్తే ఆవిడఎన్నడూ అతనితో మాట్లాడలేదు. అతని కంఠస్వరం వినలేదు. ఈ రాత్రివరకూ అతన్నిగురించి ఏమీ వినలేదుకూడా. ఇంకా చెప్పుకోవలసిన చిత్రం ఏమిటీ అంటే, ఆ రాత్రి నృత్యంలో టామ్‌స్కీకి, యువతి అయిన-పాలైన్ రాకుమారిమీద కోపం వచ్చింది. వారిరు వురూ పరాచకాలాడుకుంటూ కూచోవడం మామూలు. కాని ఆ రాత్రి రాకుమారి అతనితో కాకుండా మరో పురుషుడితో పరాచకాలాడుతూ కూచుంది. అంచాత టామ్‌స్కీకి కోపం వచ్చింది. దెబ్బకు దెబ్బ తీర్చుకోవా లనుకున్నాడు. లిసవెటాఇవనోవ్నాను తనతో నృత్యం చెయ్యడానికి రమ్మని ఆహ్వానించాడు. ఆవిడతో కలిసి

తెంపులేకుండా మజూర్కా నృత్యం చేసాడు. అంతసేపూ కూడా ఆవిడతో పరాచకలాడుతూ గడిపాడు. ఇంజనీర్లంటే తనకెంతో అభిమానమనీ, ఆవిడ ఊహించిన దానికంటె తనకు అనేకరెట్లు ఎక్కువ తెలుసుననీ అన్నాడు. అతను ఆడిన కొన్ని పరాచకపు మాటలు లిసవెటాఇవనోవ్నాకు సూటిగా తగిలాయికూడా. తన గుట్టు అతనికి తెలుసునేమోనని ఆవిడ అనేకతడవలు ఆలోచించకుండా ఉండలేకపోయిందికూడా.

"ఇదంతా మీకెవరు చెప్పారు?" అని అడిగిందా అమ్మాయి నవ్వుతూ.

"నా స్నేహితుడొకతను చెప్పాడు" అని సమాధానమిచ్చాడు టామ్‌స్కీ. "అతను నీకు తెలిసినవాడే, అసాధారణమైన వ్యక్తి" అన్నాడు.

"ఎవరా అసాధారణమైన వ్యక్తి?"

"అతనిపేరు హెర్మన్"

లిసవెటాఇవనోవ్నా సమాధానం చెప్పలేదు. కాని ఆవిడకాళ్ళు చేతులు చల్లగా, మంచుగడ్డల్లా అయిపోయాయి.

"ఈహెర్మన్ ఉన్నాడే-" అంటూ టామ్‌స్కీ ఇంకా చెప్పడం మొదలు పెట్టాడు. "ఇతను నిజంగా ఒక

అద్భుతమైన నవలలో పాత్రలాంటివాడు! ఆకారానికి నెపోలియన్‌లా ఉంటాడు. ఆత్మ మాత్రం •మెఫిస్టఫాలెస్ లాంటిది. అతని ఆత్మలో కనీసం మూడు నేరాలైనా దాగిఉంటాయని నా నమ్మకం...అరె! నీ వేమిటి ఇంతడీలాడిపోయావు!"

"నాకు తలనొప్పిగా ఉంది...ఏం జరిగింది, ఏం పేరు అతనిది – హెర్మన్ – నీతో చెప్పాడా?"

"హెర్మన్‌కు తన స్నేహితుడిమీద చాలా అయిష్టత ఏర్పడింది. తను చాలా వ్యతిరేకంగా ప్రవర్తించానని కూడా చెప్పాడు...నామటుకు నేను అతను నీ మీద ఒక కన్ను వేసి ఉంచాడనికూడా అనుకుంటున్నాను. ఎంచాతనంటే స్నేహితుడు చెప్పిన మరులుగొలిపే అద్భుతమైన విషయాలను అతనెంతో ఆసక్తితో విన్నాడు."

"కాని నన్ను తను ఎక్కడచూచాడు?"

"బహుశా చర్చిదగ్గరో లేక బయట షికారుగా వెడుతున్నప్పుడో...లేక నీవు నిద్రపోతున్నప్పుడు నీ గది

---

• గొథె రచించిన ఫాస్టులో భూతంపేరు.

—అనువాదకుడు.

లోనో-ఆ దేవుడికే తెలియాలి !- మొత్తానికి చూచాడు! అతనివల్ల ఏదైనా సంభవించవచ్చు."

అంతలో ముగ్గురుస్త్రీలు వారి దగ్గరకి వచ్చి టామ్‌స్కీ తమతో నృత్యం చేయడానికి ఆహ్వానిస్తూ "మరిచిపోయారా? లేక విచారిస్తున్నారా? అని మర్యాదంగా ప్రశ్నించారు. దాంతో లిసవెటా ఇవనోవ్నాకు కలవరం, ఆతృత కలిగిస్తున్న ఆ సంభాషణ ఆగిపోయింది.

టామ్‌స్కీ నృత్యం చేయడానికి పాలైన్ రాకుమారినే - ఎన్నుకున్నాడు. వారిరువురు నాట్యం చేస్తూ గతంతా ఒకచుట్టు తిరిగారు. తరువాత ఆవిడకుర్చీదగ్గర మరోచుట్టు తిరిగారు. అప్పటికి వారిరువురూ పూర్తిగా చక్కపడ్డారు. టామ్‌స్కీ మళ్ళీ తనచోటికి వచ్చేసరికి-ఇహ అతనికి హెర్మన్‌నుగురించికాని లిసవెటాఇవనోవ్నానుగురించికాని ఆలోచనేలేకుండా పోయింది. ఆ అమ్మాయి తను ఇరువురిమధ్య ఆగిపోయిన సంభాషణను గురించి మననంచేసుకుంటోంది. కాని అప్పటికి మజూర్కా నృత్యం అయిపోవడంతో వృద్ధ కౌంటెస్‌తో పాటు ఆవిడకూడా ఇంటికి మరలవలసివచ్చింది.

టామ్‌స్కీ అన్న మాటలు కేవలం నృత్యమందిరంలో కులాసాగా చెప్పినవే అయినప్పటికీ భావుకు

రాత్రైన ఆ అమ్మాయి ఆత్మలోఅవి లోతుగా కూరుకుని పోయాయి. టామ్‌స్కీ ఒక చిత్రాన్ని గీసి చూపి నట్లుగా చెప్పాడావిషయం. ఆవిడ తన మనస్సులో చిత్రించుకున్న చిత్రంలో సరిగ్గా సరిపోయిందది. అదే తరహాకు చెందినవ్యక్తి. ఇటీవలే వస్తున్న నవలల్లో అలాటి పాత్రలు సర్వసామాన్యంగా కనిపిస్తున్నాయి. ఇప్పుడావిడ తనగదిలో ఒంటరిగా కూచుని ఇవన్నీ మరోమాటు ఊహించుకుంటూ తన భ్రాంతికి తనే వశమవుతూ, భయ విచలితురాలవుతూ ఉండిపోయింది. నగ్నంగా ఉన్న చేతులు కట్టుకుని కూచుంది. తల్లో పెట్టుకున్న పూలు ఇంకా అలాగే ఉన్నాయి. తలముందుకు వాల్చుకుని సగం నగ్నంగా ఉన్న వక్షస్థలంపై ఆనించుకుంది...హఠా త్తుగా తలుపు తెరుచుకుని హెర్మన్ ప్రవేశించాడు. ఆ అమ్మాయి కంపించిపోవడం మొదలుపెట్టింది...

ఇంతవరకూ మీరెక్కడున్నారు?" భయంతో వణికిపోతూ రహస్యంగా అడిగింది.

"వృద్ధ కౌంటెస్ పడకగదిలో" అని జవాబు చెప్పాడు హెర్మన్. "నేనిప్పుడే ఆవిడదగ్గరనుంచి వస్తు న్నాను. కౌంటెస్ చనిపోయింది" అన్నాడు.

"అయ్యోభగవంతుడా! ఏమిటి మీరనేది ?"

చూడబోతే ఆవిడచావుకు నేనే కారణమైన ట్లుంది" అని చెప్పాడు హెర్మన్.

లిసవెటాఇవనోవ్నా అతనివంకఓరగా చూచింది. టామ్‌స్కీ అన్నమాటలు ఆవిడ హృదయంలో ప్రతి ధ్వనించాయి: "ఆ వ్యక్తి ఆత్మలో కనీసం మూడునేరాలైనా దాగిఉన్నాయి!"

హెర్మన్ ఆవిడప్రక్కనే ఉన్న కిటికీలో కూర్చుని జరిగిన విషయమంతా చెప్పాడు.

లిసవెటాఇవనోవ్నా భయభయంగా అతను చెప్పేదంతా విన్నది. కనుక ఇంతకాలం అతను వ్రాసిన తీయతీయని ఉత్తరాలన్నీకూడా ప్రేమోద్వేగంవల్ల వ్రాసినవి కావన్నమాట. తీవ్రమైన అతనివాంఛలు, హృదయాన్ని దహించివేస్తున్నట్లున్న అతని విన్నపాలు, ప్రార్థనలు, ఆ సాహసంతో వెంటాడడం; అన్నీకూడా ఇందుకోసమేనన్నమాట! ధనం – ఆ ధనదాహమే అతన్ని ఈ పనులన్నీ చేయించింది. అతని దాహాన్ని – అతని వాంఛలను తీర్చి అతన్ని సుఖపెట్టగలిగింది ఆవిడకాదు. తనకు పెట్టి పోషించిన ఆ వృద్ధురాలిని హత్యచేయడంలో

ఆ నేరస్థుడి దుష్కృత్యానికి తను తోడ్పడ్డానని ఆ అమ్మాయి అనుకున్నది. ఇలా జరిగిపోయిందన్న విచారంతో, బాధతో భోరున ఏడ్చింది. హెర్మన్ నిశ్శబ్దంగా ఆవిడవంక చూచాడు. అతని హృదయంకూడా తీవ్రమైన బాధకు గురిఅయింది. ఆ పేదరాలి కన్నీళ్ళుకాని విషాదంలో వెలుగులు చిమ్ముతున్న ఆ అమ్మాయి సౌందర్యంకాని అతని పాషాణ హృదయాన్ని ద్రవింపచేయలేకపోయాయి. తనమూలంగా చనిపోయిన ఆ వృద్ధ కౌంటెస్‌ను గురించి అతను పశ్చాత్తాపంలేదుకూడా. అతన్ని భయకంపితుణ్ణిగా చేసిందల్లా ఒకే ఒక విషయం. తనను భాగ్యవంతుణ్ణి చేస్తుందనుకున్న ఆమర్మం తనకు తెలీకుండా -మళ్ళీ ఎప్పటికీ సంపాదించడానికి సాధ్యం కాకుండా పోయిందన్న విషయమే అది.

"నీవు రాక్షసుడివి!" అన్నది లిసవెటాఇవనోవ్నా చివరకు.

"ఆవిడ కావాలని నేను కోరలేదు" అని సమాధానం చెప్పాడు హెర్మన్. "నా పిస్టల్‌లో గుండ్లు లేవు" అన్నాడు.

వా రిరువురూ మౌనం వహించారు.

తెల్లవారవస్తోంది. లిసవెటా ఇవనోవ్నా కొడిగట్టి పోయిన కొవ్వొత్తిని ఆర్పివేసింది — తెల్లబారిన వెలుగు ఆవిడ గదిలోకి పారాడుతూ వచ్చింది. ఆవిడ తన కళ్ళ తడి తుడుచుకుంది. ఏడవడంవల్ల జ్యోతుల్లా అయినాయి, ఆకళ్ళు తలెత్తి హెర్మన్ ముఖంలోకి చూచింది. అతను చేతులు కట్టుకుని కిటికీలో కూచుని ఉన్నాడు. ఏదో అపశకునం జరిగినట్లు కోపంతో కనుబొమలు ముడియ పెట్టుకున్నాడు. ఈ తీరులో అతను నిజంగా నెపోలియన్ బొమ్మలాగానే కనిపిస్తున్నాడు. ఈ రూపం లిసవెటా ఇవనోవ్నా మనస్సులోకూడా ముద్ర వేసింది.

"మీరు ఇంట్లోనుంచి బయటపడడం యెలాగ?" అని అడిగిందావిడ చివరకు. "మిమ్మల్ని రహస్య మార్గాన తీసుకెళ్ళాలనుకుంటున్నాను. కాని మనం పడకగది ముందునుంచి వేగంగా వెళ్ళిపోవాలి; నాకు భయంగా వుంది" అన్నది.

"ఆ రహస్యమార్గం యెక్కడుందో నాకు చెప్పు. నేనే కనుక్కొని వెడతాను" అన్నాడు హెర్మన్.

లిసవెటాఇవనోవ్నా అక్కడనుంచి లేచింది. అల్మయిరా దగ్గరికి వెళ్ళింది. అందులోనుంచి ఒక తాళపు

చెవి తీసి హెర్మన్ కిచ్చింది. ఆ రహస్యమార్గం ఎక్కడనుంచీ ఎలా వెళ్ళవలసిందీ విపులంగా చెప్పింది. హెర్మన్ చల్లగా, నిశ్చేష్టితంగా ఉన్న ఆవిడచేతిని నొక్కాడు. వాల్చుకుని ఉన్న ఆవిడ తలను ముద్దాడి అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

అతను చుట్లు చుట్లుగా ఉన్న మెట్లవరుస దిగి మరోమాటు వృద్ధకౌంటెస్ పడకగదిలోకి వెళ్ళి చూచాడు. చచ్చిపోయిన ఆ వృద్ధురాలు శిలలాగా కూచునిఉంది. ఆవిడ ముఖంలో ఏదో గంభీరమైన ప్రశాంతత ఆవరించి ఉంది. హెర్మన్ ఆవిడముందు నిలవబడ్డాడు. ఆవిడవంక చాలాసేపు దృష్టి నిలిపి చూచాడు – ఆ భయంకరమైన సత్యం తనలోతాను ధృవపరుచుకోవాలన్నట్లుగా చూచాడు. చివరకతను కాగితంతో కప్పబడిన గోడ తలుపుకోసం తడుముకుంటూ చదువుకునే గదిలోకి వెళ్ళాడు. అక్కడనుంచి చీకటిగాఉన్న ఒక మెట్లవరుస దిగడం మొదలుపెట్టాడు. అతని కెన్నెన్నో విచిత్రమైన ఊహాలు, కలవరాలు కలుగుతున్నాయి. "ఇదే మార్గాన అరవైఏండ్ల క్రితం, ఇదే పడకగదిలోకి, ఇదే వేళప్పుడు పొడుగాటి జరీఅంచుల అల్లికకోటు వేసుకుని, మూడు మూలల కురాయిటోపీ పెట్టుకుని అదృష్టశాలి అయిన

ఒక యువకుడు వచ్చి ఉంటాడు. సిరులు దోచుకుని వెళ్ళి ఉంటాడు. ఇప్పుడు శ్మశానంలో మట్టిలో కలిసిపోయాడు- మరి ఈ రాత్రి వృద్ధురాలయిపోయిన అతని పాతప్రియురాలి ప్రాణాలు వాయువులో లీనమైపోయాయి......" అని హెర్మన్ తనలో అనుకోసాగాడు.

మెట్లవరుస దిగివచ్చాడు. అడుగున హెర్మన్‌కు ఒక తలుపు కనిపించింది. తను తీసుకొచ్చిన ఆ తాళపు చెవితోనే తలుపుతాళం తీశాడు. ఇంట్లోనుంచి కుడి ప్రక్కగా వీధిలోకి తోవతీస్తున్న ఒక ఘూళీజాగాలోనుంచి బయటికి వెళ్ళిపోయాడు.

# 5

ప్రాణాంతకమైన ఆ రాత్రితరువాత మూడవనాటి ఉదయం తొమ్మిది గంటలకు హెర్మన్ వి-అనే మఠానికి వెళ్ళాడు. ఆ మఠంలోనే, మృత్యురాలైన కౌంటెస్ ఆత్మ శాంతికోసం పూజలు, ప్రార్థనలు జరుగుతున్నాయి. అతనికి పశ్చాత్తాపం కలుగకపోయినప్పటికీ లోపల మన సాక్షి "ఆ వృద్ధురాలిని నీవే హత్య చేశావే!" అని పదేపదే చెపుతూ వచ్చింది. అతనికిలాంటివాటిమీద నిజమైన నమ్మకం చాలా తక్కువే. కాని అనేక మూఢ విశ్వాసాలకు అతను లొంగిపోయి ఉన్నాడు. మృత్యురాలైన కౌంటెస్ తన జీవితంమీద ఏదో ఒక హానికరమైన ప్రభావాన్ని కురిపిస్తుందని విశ్వసించాడు - అంచాత ఆవిడ అంత్యకర్మలకు హాజరై ఆవిడను క్షమాపణ వేడుకుందామని నిశ్చయించుకున్నాడు.

చర్చి జనంతో నిండిఉంది. ఆ గుంపులోనుంచి ఎంతో కష్టంమీద తోవచేసుకుని వెళ్ళాడు హెర్మన్.

ఘనంగా అలంకరించిన బండిమీద శవపేటికను ఉంచారు. దానిమీద నల్లని మొఖమల్ వస్త్రాన్ని పరిచి ఆ మృత స్త్రీని పరుండబెట్టారు. ఆపిడ రెండుచేతులు వక్షస్థలం మీదపెట్టుకుని ఉంది. తలకు లేసుతో అల్లిన టోపీ పెట్టారు. తెల్లని శాటిన్ పట్టుగౌను తొడిగారు. శవపేటిక చుట్టూ ఆ కుటుంబంలోనివారంతా మూగి ఉన్నారు - సేవకులు, సేవకురాండ్రు వంటినిండా నల్లని దుస్తులు వేసుకున్నారు. వారి కుల చిహ్నాలైన రిబ్బన్లు భుజాలపైన ధరించారు. చేతుల్లో క్రొవ్వొత్తులు పట్టుకున్నారు. ఆవిడ బంధుకోటి - కొడుకులు, కూతుళ్ళు, మనమలు, మనమ రాండ్రు - అందరూకూడా దుఃఖంలో మునిగి ఉన్నారు. కాని ఎవరూ ఏడవడంలేదు. కేవలం కంటతడిపెడు తున్నట్లు నటిస్తూ ఉండవచ్చు. కౌంటెస్ పూర్తిగా వృద్ధు రాలైపోయింది. ఆవిడ మృతి ఏ ఒక్కరికికూడా ఆశ్చర్యం కలిగించలేదు. పైగా ఆవిడ బంధువులంతా ఆవిడ జీవించ వలసినదానికంటె ఎక్కువకాలం జీవించిందని ఎప్పుడో అనుకున్నారు. యువకుడైన ఒక మత గురువు ఆవిడ అంత్యకర్మలు నిర్వహించాడు - ప్రార్థనాపఠనం కావిం చాడు. ముక్తసరిగాను, హృదయాన్ని ద్రవింపచేసే మాటలతోను ఆవిడ మరణాన్నిగురించి ప్రసంగించాడు.

ఆవిడ జీవించిన ఇంత దీర్ఘకాలమూకూడా నిజమైన క్రైస్తవురాలిగా జీవించిందనీ, దైవభక్తి, ధర్మనిష్టకల ఆవిడ ప్రశాంతంగా కన్నుమూసిందనీ అన్నాడు.

"ఆవిడ పవిత్రధ్యానములు చేసుకుంటూ మేలుకొని ఉన్నది. అర్ధరాత్రివేళ రానున్న వరునికోసం లేచి ఉన్నది. ఇంకేం? మృత్యుదేవత ఆవిడదగ్గరికి వచ్చింది" అని చెప్పాడు మతగురువు.

ప్రార్థనలు విచారపూరితమైన మర్యాదలతో ముగిసినవి. మొదట బంధువులంతా మృతురాలిని కడసారి చూచి సెలవు తీసుకుని వెళ్ళిపోవడానికై దగ్గరికి వచ్చారు. వారి తరువాత లెక్కలేనంతమంది అతిథులు- ఇంతకాలం అల్పమైన ఆనందాలలో ఆవిడతో కలిసిమెలిసి తిరిగినవారంతా కడసారి చూపులు చూడడానికై వచ్చారు. తరువాత ఆవిడ ఇంట్లోవారు వచ్చారు. చివరకు పూర్వం ఆవిడఇంట్లో పనిచేసిన ఒక పరిచారిక వచ్చింది. ఆమెకూడా యజమానురాలి వయస్సే ఉంటుంది. ఇరువురు చిన్న అమ్మాయిలు ఆ వృద్ధురాలిని చేతులమీద మోసుకొచ్చారు. నేలమీదకి వంగడానికి ఆవిడకు శక్తి లేకపోయింది - అయినప్పటికీ గడ్డ కట్టుకపోయిన తన యజమానురాలి చేతిని ముద్దాడుతూ

కన్నీరు కార్చింది. అంతమంది జనంలోనూ కంటతడి పెట్టింది ఆవిడ ఒక్కతే.

ఆవిడ తరువాత శవపేటిక దగ్గరికి వెళ్ళడానికి హెర్మన్ సాహసించాడు. అతను నేలమీద సాగిలపడ్డాడు. కొద్ది క్షణాలపాటు అలాగే ఆ చల్లని గులకరాళ్ళతోను, దేవదారు కొమ్మలతోను పరుచుకుని ఉన్న నేలమీద సాగిలపడి కదలకుండా ఉండిపోయాడు. తరువాతలేచాడు. ఆ మృతురాలికంటెకూడా ఎక్కువగా అతని ముఖం వివర్ణమైఉంది. మెల్లగా శవపేటికఉంచిన బండి మెట్లు ఎక్కాడు. శవపేటికమీదికి వంగి చూచాడు...... ఆ క్షణంలో అతనికి ఆ మృత స్త్రీ తనవంక చూస్తూ వెక్కిరిస్తున్నట్లు, కనుగీటి సైగ చేస్తున్నట్లు అనిపించింది. గబగబ వెనక్కు తిరిగి మెట్లు దిగబోయాడు. ఆ తొందరలో ఒక మెట్టు తప్పిపోయి నేలమీద వెల్లకితల పడ్డాడు. అక్కడివారు అతన్ని లేవతీశారు. సరిగ్గా అదే సమయంలో సొమ్మసిల్లిన లిసవేటాఇవనోవ్నాను చర్చి ముందు వసారాలోకి మోసుకుని పోతున్నారు. ఏమైనా ఈ సంఘటనమాత్రం గంభీరంగా సాగిపోతున్న అంత్యకర్మలకు అడ్డుతగిలి కొద్ది నిముషాలపాటు సంచలనం పుట్టించింది. జనసమూహంలో మెల్లని గుసగుసలు బయలు

దేరినవి. లిసవెటా ఇవనోవ్నాకు దగ్గరి బంధువు, రాజ దర్బారులో ఉద్యోగి అయిన ఒక సన్నని వ్యక్తి తన ప్రక్కన ఉన్న ఒక ఇంగ్లీషువాడి చెవిలో గుసగుసలాడాడు. యువకుడైన ఆ ఆఫీసరు ఆవిడకు పుట్టిన కొడుకని అన్నాడు. అందుకా ఇంగ్లీషువాడు నిరుత్సాహంతో "అయ్యో!" అని సమాధానం చెప్పాడు.

ఆరోజంతాకూడా హెర్మన్ విపరీతమైన ఆందోళనలో ఉండిపోయాడు. మరుగు ప్రదేశంలో ఉన్న ఓ చిన్న హోటల్లో భోజనం చేశాడు. తనకు అలవాటు లేకపోయినప్పటికీ విపరీతంగా తాగాడు. అలాగైనా తన లోపలి ఆవేదన చల్లారుతుందేమో అనుకున్నాడు. కాని ద్రాక్షరసం అతని భ్రాంతిని మరింత రెచ్చగొట్టింది. ఇంటికి వెళ్ళిన వెంటనే దుస్తులనుకూడా విడవకుండా అలాగే పక్కమీద పడుకుని మైమరచి నిద్రపోయాడు.

అతను లేచి చూచేసరికి బాగా రాత్రి అయింది. అతని గదిలోకి వెన్నెల వరదలా వచ్చి పడింది. అతను తన గడియారం చూచుకున్నాడు - పావుగంట తక్కువ మూడు గంటలయింది. ఇహ అతనికి నిద్రపోవాలని లేదు. పక్కమీద లేచి కూచున్నాడు. వృద్ధకౌంటెస్ అంత్య క్రియలను గురించి ఆలోచించడం మొదలుపెట్టాడు.

ఆ సమయంలో ఎవరో వీధిలో నిలబడి కిటికీలో నుంచి అతనివైపు తొంగిచూశారు. మళ్ళీ అంతలోనే వెనక్కు వెళ్ళిపోయారు. హెర్మన్ ఈ విషయం పట్టించుకో లేదు. కాని ఒక నిముషం తరువాత వీధివాకిలి తెరిచి నట్లు అతనికి వినిపించింది. అతని బంట్రోతు రాత్రంతా అడ్డమైనచోట్ల తిరిగి తప్పతాగి ఏ వేళకో ఇల్లు చేరడం మామూలు. అలాగే ఇప్పుడు బంట్రోతు వచ్చి ఉంటా డని అనుకున్నాడు హెర్మన్. కాని ఆ అడుగుల చప్పుడు అతనికి కొత్తగా వినిపించింది. మెల్లగా అటూ ఇటూ ఊగుతూ స్లిప్పర్లతో ఎవరో నడిచివచ్చారు. అతనిగది తలుపులు తెరుచుకుంది. తెల్లని దుస్తులు ధరించిన ఒక స్త్రీ లోనికి వచ్చింది. ఆవిడ తన వృద్ధనన్సు అనుకున్నాడు హెర్మన్. ఆ వేళప్పుడు ఎందుకు వచ్చిందా అని ఆశ్చర్య పోయాడు. కాని తెల్లని దుస్తుల్లో ఉన్న ఆ స్త్రీ మెల్లగా జరుగుతూ ముందుకు వచ్చింది. హఠాత్తుగా అతనికి మరీ దగ్గరిగా వచ్చి నిలుచుంది - ఆవిడ కౌంటెస్ అని హెర్మన్ గుర్తించాడు.

"నేను నా సంకల్పానికి విరుద్ధంగా నీ దగ్గరికి వచ్చాను" అన్నదావిడ గృఢమైన కంఠస్వరంతో. "కాని నీ కోర్కె తీర్చమని నాకు ఆజ్ఞ అయింది. నీకు గెలుపు

ఇచ్చే ఆ మూడు పేకముక్కల పేర్లూ చెప్పుతాను విను. మొదటిది మూడు, రెండోది ఏడు, మూడోది ఆసు. కాని ఒక షరతు ఉంది. నీవు రోజుకు ఒక ముక్క కంటె ఎక్కువ ముక్కలమీద పందెంకాయకూడదు ఆతరువాత మరి నీ జీవితంలో ఎప్పుడూ పేకాట ఆడ కూడదు. పోతే నా చావుకు కారణమైన నిన్ను నేను క్షమిస్తాను. కాని దానికీ ఒక షరతు ఉంది – నీవు నా ఆశ్రితురాలైన లిసవెటాఇవనోవ్నాను వివాహ మాడాలి......" అని చెప్పింది.

ఇలా చెప్పి ఆవిడ నిశ్శబ్దంగా వెనక్కు మళ్ళింది. తలుపునైపు జారుడునడక నడుస్తూ వెళ్ళిపోయింది. వీధి తలుపు వేయడంకూడా హెర్మన్‌కు వినిపించింది. మళ్ళీ ఎవరో వీధిలో నిలవబడి కిటికీలోనుంచి తన గదిలోకి చూడడం అతనికి కనిపించింది.

అతను అందులోనుంచి మళ్ళీ తేరుకునేసరికి చాలాసేపు పట్టింది. అతను లేచి ప్రక్క గదిలోకి వెళ్ళాడు. బంట్రోతు క్రింద పడుకుని గాఢంగా నిద్ర పోతున్నాడు. ఎంతో కష్టంమీద హెర్మన్ అతన్ని లేవ గొట్టాడు. అతను మామూలుగానే తప్పతాగి ఉన్నాడు.

అంచాత అతని నోటినుంచి తెలివిగలమాట ఏదీ రాబట్ట లేకపోయాడు హెర్మన్. వెళ్ళి వీధితలుపు గడియవేశాడు. మళ్ళీ తన గదిలోకి వచ్చి దీపం వెలిగించాడు. తను చూచిన దృశ్యాన్ని గురించి అంతా వ్రాసుకున్నాడు.

# 6

భౌతిక జగత్తులో రెండు దేహాలు ఒకే ఆవరణలో, ఒకేమాటు ఎలా ఇముడలేవో అలాగే నైతిక ప్రవృత్తిలో రెండు స్థిరమైన భావాలు ఏకకాలమందు కలిసి ఉండలేవు. మూడు, ఏడు, ఆసు - ఈ మూడు ముక్కలు త్వరలోనే మృతురాలైన ఆ వృద్ధ స్త్రీ రూపాన్ని హెర్మన్ మనస్సులోనుంచి చెరిపివేశాయి. ఇప్పుడు మూడు, ఏడు, ఆసు - ఇవే ఎడతెరిపి లేకుండా అతని మనస్సులో ముసురుకుంటున్నాయి. ఎల్లప్పుడూ అతని నోట్లో ఆడుతున్నాయి. ఎవరైనా చిన్న అమ్మాయి కంటపడినప్పుడు "ఈ పిల్ల ఎంత అందంగా ఉంది! మూడు చుక్కలున్న చక్కని మూడు ముక్కలాగా ఉంది!" అనేవాడు. ఎవరైనా టైమెంతయిందని అడిగితే "ఏడింటికి అయిదు నిముషాలు తక్కువ" అని సమాధానం చెప్పేవాడు. బొజ్జ పెరిగిన మనిషి ఎవడు

కంటపడినా సరే అతనికి ఆసుముక్క జ్ఞాపకమొచ్చేది. మూడు, ఏడు, ఆసు-ఈ మూడు ముక్కలు అతన్ని అన్ని వేళలా వెంటాడుతున్నాయి. కలల్లోకూడా రకరకాల అవతారాలెత్తి కనిపిస్తున్నాయి. మూడు ముక్క ఒక అద్భుతమైన అందమైన వికసించిన పెద్ద పువ్వులాగా అతని కళ్ళముందు పొడగడుతోంది. ఏడు ప్రాచీనకాలంలో నిర్మించిన ఒక చిన్న ద్వారంలాగా దర్శనమిస్తోంది. ఆసు ఒక పెద్ద సాలెపురుగులా ప్రత్యక్షమవుతోంది. అతని ఆలోచనలన్నీకూడా ఒకే విషయంలో కలిసి పోయాయి - తనకెంతో విలువైన ఆ మర్మంద్వారా లాభం పొందాలనే దొక్కటే ఇప్పుడతని ఆలోచన. ఉద్యోగం మానుకోవాలనీ, ప్రయాణం చేయాలనీ అను కోవడం మొదలుపెట్టాడు. పారిస్ నగరంలోని ద్యూత గృహాల్లో ప్రవేసించి అక్కడ అదృష్టదేవత చేతుల్లోనుంచి ఐశ్వర్యాన్ని గుంజుకోవాలని బుద్ధి పుట్టింది. కాని అంత దూరం వెళ్ళే శ్రమ లేకుండానే మరో చక్కని అవకాశం దొరికిందతనికి.

ఆ తరుణంలో బాగా డబ్బున్న జూదగాళ్ళ సమాజం ఒకటి మాస్కోలో నడపబడుతోంది. ప్రసిద్ధుడైన చెకలిన్‌స్కీ ఆధ్వర్యాన ఆ సమాజం నడుస్తోంది. అతను

తన జీవితం యావత్తూ పేకాట ఆడడంలోనే గడిపాడు. లక్షలు పోగుచేశాడు. తనకు రావలసివచ్చినప్పుడు ప్రామిశరీనోట్లు వ్రాయించుకునేవాడు. తను ఇవ్వాల్సి వచ్చినప్పుడు రొఖం ఇచ్చేసేవాడు. అతని వివేకం, అనేక సంవత్సరాల అనుభవం, అతని స్నేహబృందంలో విశ్వాసాన్ని విశేష గౌరవాన్ని సంపాదించిపెట్టాయి. అతను ఏర్పాటుకావించిన ద్యూతగృహంలో వచ్చిన అతిథు లందరికీ ఎంతో మర్యాదగా సత్కారాలు, ఆతిథ్యాలు జరిగేవి. అతను స్వయంగా అందరిపట్ల ఎంతో ప్రేమగాను ఉల్లాసంగాను ఉండేవాడు. వీటన్నిటివల్ల అతనికి విశేష మైన ప్రజాదరణ లభించింది. అతనిప్పుడు పీటగ్సుబర్గు వచ్చాడు. ఇంకేం? యువకులంతా అతనిచుట్టూ మూగారు. అందరూ బాల్ డాన్సులు వదలిపెట్టి పేకాట మీద పడ్డారు. స్త్రీలమీద మక్కువపడినట్లుగా 'ఫారో' పేకాటమీద మోజుపడ్డారు.

అద్భుతమైన గదులు వరుసగా ఏర్పాటుచేశారు. అడుగడుగునా వరుసగా నౌకర్లను నిలవబెట్టారు జూదగా ళ్ళంతా అక్కడ పోగయ్యారు. అనేకమంది జనరళ్ళు,

ప్రీవీకౌన్సిలర్లు, ప్రఖ్యాతిగాంచిన * 'విస్టు' అనే పేకాట ఆడడం మొదలుపెట్టారు. ఇహ యువకులంతా పట్టు సోఫాలపై కాళ్ళుచేతులు పంబతన్ని పడుకున్నారు. కొందరు ఐస్‌క్రీమ్‌లు తింటున్నారు, కొందరు పైపులు కాలుస్తున్నారు. ఆతిథేయుడైన చెకలిన్‌స్కీ డ్రాయింగ్ రూమ్‌లో ఒకపెద్ద పొడుగాటి టేబిల్ ముందు కూచుని పందెంబడుతూ ఆటసాగిస్తున్నాడు. చుట్టూ - ఓ ఇరవై మంది జూదగాళ్ళు పోగయి ఉన్నారు. చెకలిన్‌స్కీకి అరవై ఏండ్లుంటాయి. చూపులకెంతో మర్యాదస్థుడిలా కనిపిస్తాడు. తలంతా పండిపోయి వెండిలా తళతళలాడు తోంది. బొద్దుగా, ఎర్రగా బొదబొద లాడుతోన్న అతని ముఖం చూచేసరికి ఉల్లాసంగాను, సరదాపుట్టిస్తూను ఉంటుంది. కళ్ళు మిలమిల మెరుస్తుంటాయి. మొహంలో ఎప్పుడూ చిరునవ్వు చిందుతూ ఉంటుంది. నరుమోవ్ హెర్మన్‌ను ఆతనితో పరిచయం కావించాడు. చెకలిన్‌స్కీ సహృద్భావంతో అతనితో కరస్పర్శ కావించి తనను పరాయివాణ్ణిగా భావించవలసిన పనిలేదని చెప్పి మళ్ళీ తన ఆటలో నిమగ్నుడైనాడు.

---

* ఇదొక ప్రసిద్ధమైన పేకాట. ఒక్కొక్కవైపు ఇద్దరు కూచుని జట్లు జట్లుగా ఆడతారు. —అనువాదకుడు.

ఆట చాలా పెద్దఆట - చాలాసేపు పట్టింది. టేబిల్ మీద ముప్ఫయి ముక్కలకు పైన ఉన్నాయి. చెకలిన్‌స్కీ పేకకలిపి ముక్కలు వేసినప్పుడల్లా ప్రతిసారి ఆగుతున్నాడు. ఆటగాళ్ళు తమచేతుల్లో ముక్కలు చూచుకోవడానికి వ్యవధి ఇస్తున్నాడు. నష్టాలు లెక్క గుర్తు వేస్తున్నాడు. అందరూ అడిగేవాటన్నిటినీ చెవి ఒగ్గి వింటున్నాడు. ఎక్కడో ఏ మూలనో ఉన్న ఆటగాడు పరధ్యానంగా మరోముక్క ఎక్కువ తీసుకుంటే అది కనిపెట్టి హెచ్చరిస్తున్నాడు. చివర కెలాగైతేనేం ఆట అయిపోయింది. చెకలిన్‌స్కీ పేకముక్కలు కలిపి మరో ఆట ప్రారంభించడానికి సిద్ధంగా ఉన్నాడు.

ఆ సమయంలో టేబిల్ దగ్గర కూచున్న ఒక లావుపాటి వ్యక్తి వెనకాలనుంచి హెర్మన్ చేయిచాపాడు. "నేనొక ముక్కమీద పందెంఒడ్డాలనుకుంటున్నాను" అన్నాడు.

చెకలిన్‌స్కీ మౌనంగా తలవంచి సరేనన్నట్లుగా చిరునవ్వు నవ్వాడు. నరుమోవ్ పకపక నవ్వుతూ ఇంత కాలానికి తన పంతం మానుకుని పేకాటలో కూచుంటున్నందుకు హెర్మన్‌ను అభినందించాడు. అతనికి అదృష్టం కలిసిరావాలని కోరాడుకూడా.

"నేను సిద్ధంగా ఉన్నాను" అన్నాడు హెర్మన్, తను ఎంచుకున్న ముక్కమీద తను కాయనున్న పందెపు సొమ్ము సీమసున్నంతో అంకె గుర్తువేస్తూ.

"అది ఎంతండీ?" అని అడిగాడు ప్రత్యర్థి అయిన చెకలిన్‌స్కీ, ఆ అంకెవైపు తేరిపార చూస్తూ. "మీరు వేసిన అంకె నేను సరిగా గుర్తు పట్టలేకపోతున్నాను" అన్నాడు.

"నలభై ఏడువేలు" అని సమాధానం చెప్పాడు హెర్మన్.

ఈమాట చెవినపడిన వెంటనే తలకాయలన్నీ ఒక్కసారిగా అటువైపు తిరిగాయి. కళ్ళన్నీ హెర్మన్ మీదనే పడ్డాయి.

"ఇతనికి మతి పోయినట్లుంది!" అనుకున్నాడు నరుమోవ్.

"నన్నొక విషయం చెప్పనీయండి." అన్నాడు చెకలిన్‌స్కీ తన సహజమైన చిరునవ్వుతో. "మీరు చాలా పెద్దపందెం ఒడ్డారు. ఇక్కడ ఎవరుకూడా ఇంత వరకు ఒక్కముక్కమీద ఇరవై ఏడువేల అయిదొందల కంటె ఎక్కువ పందెం కాయలేదు" అన్నాడు.

"సరే. ఇప్పుడేం మునిగిపోయిందీ ? మీరు ఆడ తారా లేదా !" అని మళ్ళీ అడిగాడు హెర్మన్.

చెకలీన్‌స్కీ ఎప్పటిలాగా కులాసాగా సరేనన్నట్లు తల వాల్చాడు.

"నేను ఒక విషయంమాత్రం మీకు చెప్పదల చాను" అన్నాడు మళ్ళీ చెకలిన్‌స్కీ. "నా స్నేహితులు నామీద విశ్వాసముంచి గౌరవించారు కనుక నేను రొఖంపెట్టి మాత్రమే ఆడదలిచాను. నామటుకు నాకు మీ మాటంటేనే చాలుననుకోండి. కాని ఆట నడిపించ డానికీ, ఎలాటి అపోహలకూ ఆస్కారంలేకుండా చేయ డానికీ మీరు పందెంఒడ్డేడబ్బు టేబిల్‌మీద పెట్టమని అడగవలసి ఉంది" అన్నాడు.

హెర్మన్ తన జేబులోనుంచి ఒక బ్యాంకునోటు తీసి చెకలిన్‌స్కీకి అందించాడు. అతను దాన్ని ఒక్క మాటు పైపైన చూచి హెర్మన్ ఎన్నుకున్న పేక ముక్క మీద ఉంచాడు.

తరువాత అతను పేకకలిపి ఆట ప్రారంభించాడు. హెర్మన్ ముక్కకు కుడిప్రక్కన తొమ్మిదిముక్క, ఎడమ ప్రక్క మూడుముక్క పడ్డాయి.

"నా ముక్క గెలిచింది!" అన్నాడు హెర్మన్ తన ముక్క చూపిస్తూ.

ఆటగాళ్ళలో రణగొణ ధ్వనులుబయలు దేరాయి. చెకలిన్‌స్కీ కోపంతో కనుబొమలు చిట్లించాడు. కాని మళ్ళీ వెంటనే అతని ముఖంలో చిరునవ్వు కనిపించింది.

"మీరు గెలుచుకున్న డబ్బు ఇప్పుడే ఇచ్చేయమంటారా?" అని హెర్మన్‌ను అడిగాడు.

"మీకేమీ ఇబ్బందిలేకపోతే" అన్నాడు హెర్మన్

చెకలిన్‌స్కీ తన జేబులోనుంచి బ్యాంకు నోట్లకట్ట ఒకటి తీశాడు. కావలసిన సొమ్ము లెక్కపెట్టి ఇచ్చాడు. హెర్మన్ అది తీసుకుని టేబుల్ వదిలిపెట్టి అవతలికి వెళ్ళిపోయాడు. నరుమోవ్‌కు కళ్ళు చెదిరిపోయాయి. హెర్మన్ ఒక గ్లాసు లెమనేడ్ తాగి ఇంటికి వెళ్ళిపోయాడు.

ఆ మరుసటిరోజు సాయంత్రం అతను మళ్ళీ చెకలిన్‌స్కీ దగ్గరికి వెళ్ళాడు. అతను ఆట సాగిస్తూనే ఉన్నాడు. హెర్మన్ మెల్లిగా టేబిల్ దగ్గరికి వెళ్ళాడు. వెంటనే తక్కినఆటగాళ్ళు అతనికి చోటిచ్చారు. అతన్ని చూచి చెకలిన్‌స్కీ మర్యాదగా తలవంచాడు.

మళ్ళీ కొత్త ఆట మొదలుపెట్టేవరకూ హెర్మన్ వేచిఉన్నాడు. ఆ తరువాత తనముక్క తీసి అవతలపెట్టి దానిమీద నిన్నటిరాత్రి గెలుచుకున్న తన నలభై ఏడు వేలూ పందెం ఒడ్డాడు.

చెకలిన్‌స్కీ పేకకలిపి ఆట మొదలుపెట్టాడు. హెర్మన్‌ముక్కకు కుడివైపు జాకీ, ఎడమవైపు ఏడు పడ్డాయి.

హెర్మన్ తన ఏడుబంతి తీసి చూపించాడు

అందరూ విస్మయం చెందారు. చెకలిన్‌స్కీ స్పష్టంగా భంగపాటు చెంది, కలవరపడ్డాడు. తొంభై నాలుగు వేలూ నోట్లు లెక్కపెట్టి హెర్మన్‌కు ఇచ్చి వేశాడు. హెర్మన్ ఆ డబ్బు మొత్తం చాలా నిండుగా, నింపాదు. తీసుకున్న క్షణమే అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

ఆ మరుసటిరోజు సాయంత్రం మళ్ళీ హెర్మన్ ఆట దగ్గరికి వచ్చాడు. ప్రతి ఒక్కరూ అతనికోసమే నిరీక్షిస్తున్నారు. జనరళ్ళు, ప్రివీకౌన్సిలర్లుకూడా మన్ 'లిస్టు' ఆట వదిలిపెట్టి ఈ అసాధారణమైన ఆట చూడడానికి వచ్చారు. యువకులైన ఆఫీసర్లంటరుకూడా సోఫాల్లోనుంచి లేచి వచ్చారు. నౌకర్లంతా డ్రాయింగ్

రూమ్‌లోనే గుమికూడారు. అందరూకూడా హెర్మన్‌ను చుట్టుముట్టారు. తక్కిన ఆటగాళ్ళెవరూకూడ తమ పందెములు ఒడ్డలేదు. ఆట ఎలా నడుస్తుందో చూదామని అందరూ ఆతృతతో కనిపెట్టుకుని ఉన్నారు. హెర్మన్ టేబిల్ దగ్గరికి వచ్చాడు. వివర్ణుడై ఉన్నప్పటికీ చిరునవ్వుతో ఉన్న చెకలిన్‌స్కీతో తను ఒక్కడే పందెం. వేసి ఆట ఆడడానికి సిద్ధపడ్డాడు - హెర్మన్. అందరూ తలకొక కొత్తపేక విప్పడం మొదలుపెట్టారు. చెకలిన్‌స్కీ. పేక కలిపాడు. హెర్మన్ పేకకోసి, తన ముక్క తీసుకుని బోర్ల పెట్టాడు. దానిమీద బ్యాంకునోట్లు కుప్పపెట్టాడు. అది నిజంగా ఒక ద్వంద్వయుద్ధంలాగా ఉంది. గది అంతటాగూడా చీమ చిటుక్కుమనసంత నిశ్శబ్దం ఆవరించింది.

చెకలిన్‌స్కీ ముక్కలు వెయ్యడం మొదలు పెట్టాడు. అతని చేతులు వణుకుతున్నాయి. కుడివైపున రాణి, ఎడమవైపున ఆసు పడ్డాయి.

"ఆసు గెలిచింది!" అంటూ హెర్మన్ తన ముక్క తీసి చూపించాడు.

"మీరు పట్టిసినముక్క రాణి-" అన్నాడు చెకలిన్‌స్కీ మర్యాదగా

హెర్మన్ భయంతో కంపించిపోయాడు. అది నిజమే – ఆసుకు బదులుగా అతనిదగ్గర ఇస్పేటురాణీ ఉంది. అతను తనకళ్ళను తానే నమ్మలేకపోయాడు. తను ఎలా పొరపాటు పడిందీకూడా అతను తెలుసుకో లేకపోయాడు

ఉన్నట్లుండి హఠాత్తుగా ఆ ఇస్పేటురాణి తనను చూచి వెక్కిరిస్తున్నట్లు, కన్నుగీటి సైగచేస్తున్నట్లు అని పించిందతనికి. ఒక అసాధారణమైన రూపం వచ్చి అతన్ని దెబ్బకొట్టింది. అతనికి సొమ్మసిల్లి నట్లనిపించింది.

"ఆ వృద్ధురాలు!" అని భయంతో అరిచాడతను.

చెకలిన్‌స్కీ- అతనిదగ్గరనుంచి తను గెలుచుకున్న డబ్బు తీసుకున్నాడు. హెర్మన్ నిశ్చేష్టుడై నిలవబడ్డాడు. చివరకు తన టేబిల్ దగ్గరనుంచి వెళ్ళిపోయిన తరువాత అందరూ బిగ్గరగా మాట్లాడడం మొదలుపెట్టారు.

"ఏమి ఆట! అద్భుతంగా ఆడాడతను!" అన్నారు ఆటగాళ్ళు.

చెకలిన్‌స్కీ- మళ్ళీ పేకకలిపాడు. ఆట యథా విధిగా సాగిపోయింది.

# ముగింపు

హెర్మన్ పిచ్చివాడైపోయాడు. అతనిప్పుడు అబుకోవ్ ఆస్పత్రిలో 17 వ నెంబరు వార్డులో పడి ఉన్నాడు. ఎవరు ఎన్ని ప్రశ్నలడిగినా వేటికీ సమాధానం చెప్పడు. కాని తనలో తాను అదేపనిగా అతివేగంగా గొణుక్కుంటూ ఉంటాడు:

"మూడు, ఏడు, ఆసు... మూడు, ఏడు, రాణి!"

లిసవెటా ఇవనోవ్నా అన్నివిధాల తగిఉన్న ఒక యువకుణ్ణి వివాహం చేసుకున్నది. ఏదో గవర్నమెంటు ఆఫీసులో ఉద్యోగం అతనికి. తగినంత ఆస్తిపాస్తులు ఉన్న వాడుకూడా. అతను పూర్వం వృద్ధ కౌంటెస్ ఇంట్లో పెత్తందారుగా పనిచేసిన ఆయనకుమారుడు. లిసవెటా ఇవనోవ్నా తన బంధువురాలైన ఒక పేదపిల్లను పెంచుతోంది.

టామ్‌స్కీకి కెప్టెన్ పదవి వచ్చింది. పాలైన్ రాకుమారిని వివాహ మాడబోతున్నాడు.

1834

---

